# వీణా

మెట్టా వెంకటేశ్వరరావ్



—: రూపాయి :—

సాయంత్రం 5గంటలవేళ అప్పుడే బడి వదలి పెట్టటం చేత పిల్లలందరూ బడి ముందరి ఖాళీ స్థలంలో మూగి ఆటలాడుకుంటున్నారు. అందరూ పదేళ్ళలోపలి పిల్లలే. అదిపెళ్ళాట. పిల్లలు రెండుపక్షాలుగా చీలి ఎదురెదురుగా నిలబడ్డారు "బుడ్డెడు బుడ్డెడు వరహాలిస్తాం బూబుల్లారా మా బీబీకూతుర్ని చేసుకోండి బూబుల్లారా" అని పాటపాడుకుంటూ వచ్చి ఆడపిల్లవైపువాళ్లు మగపిల్లవాడి వైపువాళ్ళని తమ పిల్లని వాళ్ళబ్బాయికి చేసుకోమని బతిమాల్తున్నారు. మగపిల్లవాడివైపు వాళ్ళు బెట్టుచేస్తున్నారు. ఆఖరికి కట్నం పది బలపాలని నిశ్చయంచేసుకుని పెళ్ళికిఖాయపడ్డారు. అంతకుముందే తయారుచేసి అట్టేపెట్టుకున్న తాటాకు బూరలతోను —సీనా రేకుడబ్బాలతోను పెళ్ళివైభవంగా జరిగిపోయింది. పిల్లలు తమతమ తల్లుల్ని ఏడిపించి తెచ్చుకున్న కానీలతో కొని తెచ్చుకున్న సెనగపప్పుతో అన్నివిందులూ జరిగిపోయాయి.

పెళ్ళికూతుర్ని, పెళ్ళికొడుకునీ తమతమ ముందర కూర్చోబెట్టుకుని పూలచెండ్లాడించారు. పేర్లుచెప్పేవేళ వచ్చింది. ముందర పెళ్ళికొడుకేచెప్పాలన్నారు ఆడపెళ్ళివారు. "మాఅబ్బాయికి ఏరీ కోరీ బతిమాలిచేసుకున్నారు కాబట్టి ముందుపెళ్ళికూతురే చెప్పాలన్నారు. కాదు పెళ్ళికొడుకే ముందుచెప్పటం విధాయకమన్నారు ఎన్నో పెళ్ళిళ్ళు చేయించిన అనుభవశాలురు. కాని

పెళ్ళికొడుకు "ఉహూ" అంటున్నాడు. ఇంతలోకే ఆడపెళ్ళివారిలో ఒకనాపసాని లేచి "పెళ్ళికొడుకు పిల్లాడు భలే బెట్టుచేస్తున్నాడే —అలిగినట్టున్నాడు ఇదిగో! యీబలపం తీసుకుని అలక తీర్చుకుని పెళ్ళికూతురి పేరు చెప్పవయ్య పెద్దమనిషీ" అనితగూ తీర్చింది. పెళ్ళికొడుకు మెల్లిగా "శ్యామల" అన్నాడు. ఇక పెళ్ళికూతుర్ని చెప్పమన్నారు. కాని తలవంచుకుని అలాగే కూర్చుంది. "ఎబ్బే యీపిల్లకి మాటలురావల్లే ఉందే అయ్యో! ఎక్కడో ఎరక్కపోయి మూగదాన్ని చేసుకున్నానే" అని మగపెళ్ళివారు ఎగతాళిచేస్తున్నారు. కోపంవచ్చింది పెళ్ళికూతురికి —సత్యనారాయణ"అనిగట్టిగాఅనేసి లేచిపోయింది."అయ్యో అప్పుడే పెళ్ళికూతురుమొగుణ్ణి వదిలిపెట్టి లేచిపోయిందే" అని పకపకలాడుకుంటూ అంతా లేచారు. అంతటితో ఆటపూర్తయింది. ఇదంతా దూరాన్నుండిచూస్తూ కూర్చున్న వెంకటలక్ష్మమ్మగారు నవ్వుకుంటూ నిజంగా ఇలాగే జరిగితే బాగుండునని" అనుకుంది. పిల్లలు ఎవరి సంచీవాళ్ళు తీసుకుని యిళ్ళకు వెళ్ళిపోయారు.

బడిపంతులు లక్ష్మీకాంతయ్యగారుండేయింట్లోనే పెద్దవసారాలో బడి. ఆయన భార్య వెంకటలక్ష్మమ్మ వాళ్ళ ఒక్కగానొక్క కూతురూ, గారాబాలపట్టీ శ్యామల. బళ్ళోఆధిపత్యమంతా ఆపిల్లదే. పంతులుగారి కూతురు గాబట్టి శ్యామలంటే ఎంగతా పిల్లలకు భయమూ గౌరవమూను. సత్యనారాయణ ఆవూరిలో పెద్దరైతైన వెంకటసుబ్బయ్యగారి ఏకైకపుత్రుడు. వెంకటలక్ష్మమ్మగారికి వెంకటసుబ్బయ్యగారు దూరపువరసన అన్నౌతారు. ఆయనగారే లక్ష్మీకాంతయ్యగార్ని తమపల్లెకు

బడి అంతా విని యోగించి తమగ్రామం ఆనందపురానికి బదిలీ చేయించుకున్నారు. అందుకు కారణాలు వెంకటసుబ్బయ్యగారికి తనచెల్లెలు వెంకటలక్ష్మమ్మ గారిమీద ఉండే అభిమానం— ఆపూరుకువస్తున్న ఏపంతులయినా పిల్లలకి చదువు సరిగా చెప్పకపోటం లక్ష్మీకాంతయ్యగారు పిల్లలక్కి చాలాబాగా చెబుతారనే పేరుం డటం. మూడేళ్ళక్రితమే పంతులుగారీ ఊరువచ్చారు. తక్కువ స్థితిలోఉన్న పంతులుగారి సంసారానికి వెంకటసుబ్బయ్యగారెంతో అండగాఉంటున్నారు. పంతులుగారుకూడా ఆయనంటే ఎంతో భక్తి గౌరవాలతో ఉంటూ సత్యనారాయణను తమపిల్లతో పాటు అందరు పిల్లలకంటే ఓగంట ఎక్కువసేపు పాఠాలు చెబుతూంటారు.

శ్యామలా సత్యనారాయణ లిద్దరూ రోజుల వ్యత్యాసంతో పదేళ్ళక్రితమే పుట్టారు. ఇద్దరూ అయిదవ తరగతి చదువుతు న్నారు. భలే చురుకైనవాళ్ళు. ఒకళ్ళనొకళ్ళు విడిచిపెట్టలే నంత స్నేహం. ప్రస్తుతమూ లేతహృదయాల్లోస్థాన మంతవరకే. ఏదన్నా అవసరంవచ్చి నప్పుడు వాళ్ళిద్దరిమధ్య ప్రాకిన స్నేహ లత త్రెంచటానికి సాధ్యమౌతుందా? అనేటంత అన్యోన్యంగా వాళ్ళిద్దరూ ఉంటారు. సత్యమెప్పుడు యింటికి వెళ్ళిరెండుమెతు కులు తినివస్తాడో అంతే మిగతా పగటికాలంఅంతా శ్యామల తోనే గడుపుతాడు. వెంకటలక్ష్మమ్మా లక్ష్మీకాంతయ్యగారు కూడా వీళ్ళఅన్యోన్యతకెంతో సంబరపడతారు. వెంకటలక్ష్మమ్మ గారెప్పుడన్నా తనబేలహృదయాన్ని ఆపుకోలేక వీళ్ళుఎల్లకాలం యిలాగేఉంటే బాగుండునండీ' అని భర్తతో అంటే "ఓసి

ఊరుకోవే పిచ్చిమొద్దు! ఎవరన్నా వింటే నవ్వుతారు.' అనికోప్పడేవాడు. కాని ఆపిల్లలిద్దరూ యీబాహ్యప్రపంచంతో సంబంధం పెట్టుకునేవాళ్లేకాదు. వాళ్ళదదోలోకం. ఆలోకంలోవాళ్ళిద్దరే ఉండేది. ఎవరింట్లో ఏపిండివంటచేసినా యిద్దరూకలసితినాల్సిందే. ఏవిషయమైనా యిద్దరికీ తెలియాల్సిందే. 'వాళ్ళిద్దరూ కలిసి ఆడుకోవాలి, కలిసి పాడుకోవాలి. వాళ్ళిద్దరి మధ్యా అంత అవినాభావ సంబంధం ఏర్పడింది ఆపూపవయస్సులోనే—

కాని కాలంఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉండదు. పోస్టు బంట్రోతు తెచ్చిన పొడుగాటి కవరు ముందు సత్యం తీసుకుని శ్యామలకిచ్చాడు. శ్యామల లక్ష్మీకాంతయ్యగారి కిచ్చింది. "నాన్నా యిదుగో పేద్దఉత్తర"మంటూ. "ఎక్కడనుంచండీ" అనుకుంటూ వెంకటలక్ష్మమ్మగారు బయటకువచ్చింది వంటింట్లోనుండి. ఆదుర్దాగాచింపుకున్నాడు —చూశాడు. "అరి వీళ్ళ మ్మకడుపుకాలా" అంటూ ఉత్తరంక్రింద పారేశాడు. "అదేమిటి నాన్నా" అంటూశ్యామల— "అదేమిటండీ" అంటూ వెంకట లక్ష్మమ్మ, సత్యనారాయణలు ప్రశ్నించారు. "ఇంకా ఏమిటే మిటే! మాటాముల్లే సద్దూ— "నాయనా సత్యం! మీవూరి నుండి వెళ్ళగొడుతున్నారోయ్ మమ్మల్ని" అన్నారు పాపం విచారంగా పంతులుగారు ."అయిందీఅంటూ" వెంకటలక్ష్మమ్మ గారుజారిగిలబడ్డది. "మిమ్మల్ని వెళ్ళగొట్టేదెవరండీ" అనిఅన్నాడు సత్యం పాపంఅమాయికంగా తన లేతహృదయాన్ని ఉండపట్టలేక. "ఏమిటినాన్నా" అంటూ శ్యామలతండ్రిని ప్రాకుతూఅడిగితే పాపంలక్ష్మీకాంతయ్యగారు "మనంయిక గుంటూరువెళ్ళిపోవాలే

అమ్మా' అని అనేసరికి శ్యామలా, సత్యనారాయణుల గుండె ఝల్లుమన్నది. శ్యామలఒకసారి తండ్రిని ఒకసారి సత్యంను చూస్తున్నది పిచ్చిగా. సత్యంమాత్రం ఒక్క శ్యామలవైపే చూస్తున్నాడు జాలిగా

లక్ష్మీకాంతయ్యగారు పైబట్ట వేసుకుని చకచక వెంకట సుబ్బయ్యగారింటికి వెళ్ళి ఆయనతో సంగతంతా చెప్పారు. పాపం ఆయన నిర్ఘాంతపోయారు. అయినా ప్రయత్నంచేస్తాన న్నారు బదిలీఉత్తరువు రద్దుచేయించేందుకు.

చెప్పినప్రకారం వెంకటసుబ్బయ్యగారు విశ్వప్రయత్నాలు చేశారు. వెనకటి ఉద్యోగస్థులంతా మారిపోయి ఇప్పుడంతా క్రొత్తవాళ్ళురావడంచేత ఆయనగారి ప్రయత్నాలేమీ కొన సాగలేదు. పైగా లక్ష్మీకాంతయ్యగారు పిల్లలకి చాలాశ్రద్ధగా చదువుచెబుతారనే "రిమార్కు" ఉండటంవల్ల ఆయనగుంటూరు లోనే ఉండాలని పట్టుపట్టి అధికారులే అలాచేశారు. అందు వల్ల పాపం లక్ష్మీకాంతయ్యగారికి ఆనందపురం వదలిపెట్టి వెళ్ళ వలసినఅవస్థ తప్పిందికాదు.

రేపు తెల్లవారగా పంతులుగారి కుటుంబం ఆవూరువదలి వెళ్ళిపోతుందనగా నేటిసాయంకాలం ఆవూళ్ళోవాళ్ళంతా ఒక సభ ఏర్పాటుచేసి తమ పిల్లలవిద్యాభివృద్ధికి శ్రీలక్ష్మీకాంతయ్య గారేవిధంగా కృషిచేసిందీ, ఏవిధంగా తమపిల్లలకు మంచిమంచి అలవాట్లునేర్పి వారిని భావిభారతపుచక్కని పౌరులుగా తయార య్యేందుకు పునాదివేసిందీ—ప్రతివారూ తమకు తోచినట్లల్లా చెప్పి

అటువంటి పంతులుగారు నేటికి తమఊరు విడిచివెళ్ళుతున్నందుకు తమవిచారాన్ని తెలియజేశారు. సభాధ్యక్షులయిన వెంకట సుబ్బయ్యగారు లేచి శ్రీలక్ష్మీకాంతయ్యగారు తమకుచుట్టాలే ననీ, వారిబడిజీవిత మెంత పవిత్రంగాఉంటుందో తక్కిన గృహ జీవితంకూడా అంతపవిత్రంగానే ఉంటుందనీ పిల్లలకు లేతమనస్సు లంలో అతికిపోయేటట్లు చదువుచెప్పటంలో వారికిగల చాక చక్యాన్ని ప్రశంశిస్తూ వారిని ఆనందపురం రప్పించేందుకు తా మెంతకృషిచేసిందీ మళ్ళీయిప్పుడు బడిలో ఉత్తరువు రద్దుచేయిం చేందుకు తామెంత ప్రయత్నించిందీ, ఫలితం లేకపోవటంవల్ల తమ విచారాన్నికూడా తెలియబరిచారు. ఆపైన పంతులుగారిని పళ్ళుఫలాలూ, కట్టుపుట్టాలతో సత్కరించారు. తర్వాతవారితో విడిపోయేసందర్భాన ఒకచిన్న బంగారపు గొలుసు కచ్చితంగా నూటపదహారు రూపాయల విలువగలది బహూకరిస్తున్నానని, సొమ్మునగదు రూపంగా ఉంటేచిరస్మరణీయంగా ఉంటుందని చెబుతూ తండ్రి ఒడిలో కూర్చున్న శ్యామలకీయబోతుండగా తండ్రిప్రక్కనే ఉన్న సత్యనారాయణ గొలుసు అమాంతంగా లాక్కొని తానే స్వయంగా శ్యామలమెళ్లో వేశాడు. సభలో ఆవింతచూచిన అరగంటదాకా సద్దుమణగలేదు. తర్వాత లక్ష్మీకాంతయ్యగారు లేచి తమయెడ ఆపూరివారంతా, చివరకు పసిబాలుడైన సత్యంకూడా చూపించిన ఆదరణకు ప్రేమకు తమ హృదయపూర్వక కృతజ్ఞతను తెల్పుతూ ఆపూరినుండి వెళ్లిపో వటం గ్రామస్థులకేకాక తమకుకూడా చాలావిచారంగా ఉన్నదని మళ్ళీపిలుంటే ఆవూరురావటానికి తామెంతో సంబరపడతామని చెప్పేరు. సభికుల కరతాళధ్వనులతో సభముగిసింది.

ఆరోజు రాత్రిషుమారు ఎనిమిది గంటలౌతుంది. వెంకట సుబ్బయ్యగారు లక్ష్మీకాంతయ్యగారి కుటుంబాన్ని తమయింటి పూటభోజనానికి పిలిచారు. శ్యామలా సత్యనారాయణ లిద్దరూ ముందుగా భోజనంచేసి లేచి వాకిట్లోవేసిఉన్న పక్కలమీద కూర్చున్నారేమేమిటో మాట్లాడుకుంటూ. చంద్రుడుతనఅమృత బాహువులతో ఆప్రేమమూర్తుల్ని-వారివియోగ దుఃఖసంజనిత నయనోదకాల్ని తుడుస్తూ- కొంతవరకైనాతన చల్లదనంతో సుఖపెట్టడానికి ప్రయత్నిస్తున్నాడు. "మీరు వెళ్ళకపోతేమటు కేంశ్యామా" అన్నాడు సత్యనారాయణ జాలిగా. "మరి మా నాన్న వెళ్ళాలంటున్నాడుగా సత్యాం" "ఎందుకు శ్యామా! వెళ్ళటం? మాయింట్లోనేఉండండి. మనిద్దరంకలిసి హాయిగా మీ నాన్నదగ్గర చదువుకుంటూ సాయంకాలంకాగానే ఆడుకుంటూ ఉందాం" అని సత్యంఅన్నవెంటనే శ్యామల యింట్లోభోంచేస్తు న్నవాళ్ళనాన్నదగ్గరకు పరుగెత్తుకెళ్ళి "నాన్నా సత్యమే-మననే- వాళ్లింట్లోనే ఉండమంటున్నాడునాన్నా మనం ఎక్కడకీ వెళ్ళొ ద్దునాన్నా! ఇక్కడే ఉందాంనాన్నా! ఏంనాన్నా!" అని పాపం ఆపిల్లతనలేతవయస్సులోని అమాయికతను ప్రకటించింది. ఆ మాటవిని వాళ్ళంతా ఒకటే నవ్వుకోటం. అప్పుడు వెంకట సుబ్బయ్యగారి భార్య అన్నపూర్ణమ్మగారు శ్యామలను దగ్గరకు తీసుకుని తలనిమురుతూ "ఏమేశ్యామా! మాసత్యాన్నుపెళ్ళిచేసు కుని అప్పుడే కాపరానికుందామనుకుంటున్నావా యేమిటే" అని నవ్వుతూ అడిగితే వెంకటలక్ష్మమ్మగారు అందుకొని "ఓ యమ్మతల్లి! కొడుక్కిఇచ్చగా చేసుకునేదానిమల్లేనే మాట్లాడు తున్నావేవుమ్మాయ్ వదినా" అంటే లక్ష్మీకాంతయ్యగారు

'ఎందుకుచేసుకోరూ! నీతాతాముత్తాతలు గడించిపెట్టిన మూం టాముల్లే ఏమన్నాఉంటే పట్టుకురా కట్నమిచ్చేందుకు'' అని అంటిస్తే, రాసిపెట్టిఉంటే కట్నాలడ్డుతాయా బావగారూ'' అని వెంకటసుబ్బయ్యగారు తీర్పుచెప్పి "ఏమేశ్యామలా'' అనితలత్తే సరికి ఏదీ? అప్పుడే వెళ్లిపోయింది. వీళ్ళమాటలతో ఆపిల్ల కేంపని?

సామాన్లుబళ్ళకెత్తేరు. అవిసాగినయ్. ఆఉపాధ్యాయ కుటుం బాన్నిసాగనంపుతున్నారు వెంకటసుబ్బయ్యగారూ సత్యనారా యణ. చెరువుదాకా బళ్ళువెళ్లినాయ్. "ఇకఉండండి బావ గారూ'' అంటూ పంతులుగారు వెంకటసుబ్బయ్యగారి చేతులు పట్టుకుని ఆపగా. ఆయనగారాగి "మంచిది ఇకఉంటానండీ. అప్పుడప్పుడు క్షేమసమాచారాలు తెలియజేస్తూఉండండి'' అని అంటూండగా కొంచెం వెనకాలగా నడిచివస్తున్న శ్యామలా సత్యనారాయణులు వారిని కలుసుకున్నారు. "ఏరా! నాయనా సత్యనారాయణ జ్ఞాపకముంచుకోనన్ను'' అనితలనిమిరి "రా అమ్మా'' అని శ్యామలనెత్తుకోబోతుండగా యిద్దరుపిల్లలూ ఒక్కసారిగా గొల్లుమన్నారు. అప్పుడు పిల్లల్నిఎత్తుకుని "తప్పె మ్మాతప్పు.అలాఏడవకూడదు.నాలుగురోజులలో మళ్ళీవద్దాంగా' అని లక్ష్మీకాంతయ్యగారు కూతుర్ని, "తప్పునాన్నా అబ్బే అట్లాఏడుస్తారా మళ్ళీశ్యామలావాళ్ళు నాలుగు రోజులలో వస్తారని వెంకటసుబ్బయ్యగారు కొడుక్కి చెప్పి సముదాయించే సరికి హరిహరాదులు దిగివచ్చారు.

"సరే శెలవు బావగారూ'' అంటూ లక్ష్మీకాంతయ్యగారు సాగేరు. 'తప్పకుండా రావాలి శ్యామా' అని సత్యంఅనేసరికి 'ఓ తప్పకుండా వస్తాం' అనిచిటికివేసిచెప్పింది శ్యామల.

వెంకటసుబ్బయ్య లక్ష్మీకాంతయ్యగార్లు వేర్వేరుదిక్కులకు అభిముఖులై వెళ్తుంటే వారిబుజాలమీద ఉన్నపిల్లలు ఒకరినొకరు చూసుకుంటూనే 'తప్పకుండా వస్తాంగానాన్నా' అని 'తప్పకుండావస్తారుగానాన్నా' అని తమతమ తండ్రులనడుగుతూ చెట్ల గుంపు అడ్డువల్ల ఒకరికొకరు అదృశ్యులైపోయారు.

•

గుంటూరులో లక్ష్మీకాంతయ్యగారికి అధికార సంఘమే స్వయంగ ఒకవసతిగృహం ఏర్పాటుచేసింది. ఆయింటిముందు విశాలమైన చక్కటి ఖాళీస్థలముంది. అందులో రకరకాల పూలమొక్కలున్నయ్. అంతకుముందు ఆయింట్లోఉన్న మునిసిపల్ మేష్టరుగారు తనపడుచు పెళ్ళాంకోసం ఏరికోరి సాధించితెచ్చి, నాటి, పూటపూట కడవలకొద్దీ నీళ్ళుపోసి పాపం ఎంతో ఆప్యాయంగ పెంచిన మొక్కలవి.

శ్యామల యీమొక్కలను, యింటిముందరిరోడ్డుమీద క్షణక్షణానికివచ్చే పోయే కార్లు బళ్ళు సందడిచూసి ఆనందపురాన్నైతే మరిచేపోయిందిగాని తనతోడు నీడలాఉండే సత్యాన్ని మాత్రం మరువలేదు. అనుక్షణం తన తల్లి దండ్రులను 'మళ్ళీ ఆనందపురం వెళ్ళటం ఎప్పు' డని అడుగుతూనే ఉంటుంది. ఆ పిల్లకు సర్దిచెప్పలేక ఆ దంపతులు సతమతమవుతున్నారు. పిల్ల దిగులుతో చిక్కిపోతుంది. లక్ష్మీకాంతయ్యగారు భయపడి డాక్టరు వద్దకు తీసికెళ్ళి చూపించి సంగతంతా చెబితే 'ఏపిల్లలతోనైనా సహవాసంచేయించి కొంచెంహుషారుగా ఉండేటట్లు చూడండి. లేకపోతే జంగతో పిల్ల చిక్కిపోతుంది'. అని సలహాయిచ్చాడు.

వాళ్ళుంటున్న యింటియెదురుగా వాసుదేవరావుగారనే ప్లీడర్ ఉంటున్నారు. ఆయనభార్య శారదాంబగారు. ఆదంపతులకు రామకృష్ణ అనేకొడుకు నిర్మలఅనే కూతురూ, ఇద్దరే పిల్లలు చాలా మంచివాళ్ళు. గొప్పవాళ్ళమనే గర్వమేమాత్రం లేదు. మొదట్లో నిర్మలాశ్యామల నొకళ్ళనొకళ్ళు చూసుకుని నవ్వుకుంటూ కలసి ఆడుకోవాలనుకునే వాళ్ళేగాని ఎవరూ ముందడుగువేసి స్నేహము కలుపుకోలేక పోయారు. నిర్మలారామకృష్ణలు కలిసి వాళ్ళగుఱ్ఱపు బండిలో యెక్కి బడికి వెళ్తుంటే శ్యామల పాపం తన లేత హృదయక్షేత్రంలో వింతవాత కోర్కెల విత్తనాలు చల్లుకుంది.

ఒకరోజున నిర్మలే ముందుగా శ్యామలను చేత్తో సంజ్ఞచేసి పిలిచింది. నిజంగా శ్యామలకు కూడా నిర్మలతో ఆడుకోవాలనే ఉంది. అందుచేత నిర్మలపిలవగానే మెల్లిగా వెళ్ళి రెండిళ్ళకీమధ్యనున్న రోడ్డుమీద నిలబడింది. నిర్మల ఎదురుగా వచ్చి శ్యామల చెయ్యి పట్టుకుని వాళ్ళింట్లోకి తీసుకువెళ్ళింది. శారదాంబగారితో అమ్మా ఇదుగో చూడు, యివాళనుండీ మాయిద్దరికి స్నేహము అని చెప్పింది. శారదాంబగారు "నీపేరేమిటమ్మా" అనిఅడిగితే శ్యామల పాపంబెరుగ్గా తనపేరుచెప్పింది. ఇవాళనుంచీ నువ్వూ నిర్మలతో కలిసి ఆడుకుంటూంటావా అని అడిగితే మెల్లగా తల ఊపింది. నిర్మల తనస్నేహితురాల్ని, తండ్రి తనకూ తన అన్నకూ ప్రత్యేకంగా చదువుకోటానికని నిర్ణయించి యిచ్చిన గదిలోకి తీసుకెళ్ళి ఒకకుర్చీలోకూర్చోబెట్టి పంచదార బిళ్ళలొక గుప్పెడు తెచ్చి శ్యామలకు పెట్టింది. తనూకాసినతింది. నిర్మల

కూడా చాలాచురుకైనది. అందచందాల్లో గాని, బుద్ధికుశలతలో గాని శ్యామల కేమాత్రం తీసిపోదు. ఇంతలో రామకృష్ణ కూడా వచ్చాడు ఆగదిలోకే. "అన్నయ్యా! ఇదిగో నా స్నేహితురాలు' అని నిర్మలంటే "నాకు తెలుసు లేద్దూ. ఎదురింటి వారమ్మాయేగా' అని, రామకృష్ణ "నీకు కేరమ్స్ ఆట్టం చేతౌనా?" అని అడిగితే పాపం ఆపల్లెటూరి శ్యామల యేమిటో తనకు ఆ ఆట చేత కాక పోవటం పెద్ద అవమానకరమనుకుంటూనే తల వ్యతిరేకార్థకంగా త్రిప్పింది. "మేం నేర్పుతాం రా!" అని చకచక చాప తెచ్చి వేసి అంతా అమర్చి శ్యామలను కూడా ఒకవైపు కూర్చోబెట్టి నేర్పుతున్నారు.

సంవత్సరకైవారంగల కాలచక్రం ఒక్క చుట్టు తిరిగింది. ఇప్పుడు సమానవయస్కులైన శ్యామలానిర్మలలు ఫస్టుఫారం, వీళ్ళిద్దరికంటె రెండేళ్ళు పెద్ద అయిన రామకృష్ణ థర్డ్‌ఫారం చదువుతున్నారిప్పుడు. ముగ్గురూ ఒక స్కూల్లోనే. ముగ్గురూ ఒకేజట్టు. ఇప్పుడసలు శ్యామల ప్రకృతే మారింది. ఎంతసేపూ 'నిర్మలా రామకృష్ణ నిర్మలా రామకృష్ణ' తల్లిదండ్రులవద్ద కూర్చోవటమే తక్కువ. అసలింట్లో ఉండటమే చాలా అరుదు. 24 గంటలు నిర్మలా రామకృష్ణలతోనే కాలక్షేపం. నిర్మల తొడిగిన గానే శ్యామలా తొడగాలి.

ప్రొద్దున 7గంటలకు లేచి మొహం [illegible] ని కాఫీతాగి 9గంటలదాకా నిర్మలారామకృష్ణలతో [illegible]టం, 10గంటల దాకా భోజనం, టాయిలెట్ చేసుకోవటం తర్వాత నిర్మలా రామకృష్ణలతో వాళ్ళజట్కా ఎక్కి స్కూలుకి పోవటం.

సాయంత్రం మళ్ళీ 5గంటలకు యింటికివచ్చి ఒకగంటసేపు వీణవాయించుకోవటం, తర్వాత నిర్మలారామకృష్ణ వాసుదేవ రావుగార్లతో షికారుకు వెళ్ళి రావటం, వచ్చి స్నానం చేసి భోంచేసి, ఒకగంటసేపు చదువుకోవటం ఇదీ ఆపిల్లదినచర్య.

లక్ష్మీకాంతయ్య గారికి, తనకూతురు గొప్పింటివాళ్ళతో సహవాసంచేస్తూ వాళ్ళలో ఒకతెగా మెలగటం, వెనకటిలాగా బెంగపడకుండా హుషారుగా చలాకీగా ఉండి తనచదువూ తన వ్యవహారాలు స్వయంగా చూసుకోవటం, చూస్తే చాలా ఆశ్చర్యం, ఆనందం కలిగేయి. తీగలాగా అల్లుకుపోయే ప్రతిభ గల తనకూతురికి సుప్రసిద్ధ భారతదేశ వాద్యమైన "వీణ" చెప్పించాలన్న ఉద్దేశ్యం ఆయనకే కల్గింది. దాన్ని వెంకట లక్ష్మమ్మ గారు ప్రోత్సహించింది. శ్యామల కూడా తండ్రిని కోరింది. అందుచేత అంతకుముందు కొంచెంకొంచెంగా నెలకు 5,6 రూపాయలేమన్నా వెనకవేసుకున్న వాటిల్లో 250రూపా యలుపెట్టి వీణకొని నెలకు తనకువచ్చే 80రూపాయల జీతంలో 10రూపాయలు మేష్టరుకిచ్చి వీణ చెప్పిస్తున్నాడు కూతురికి. అన్నిటికంటే ఎక్కువగమ్మత్తేమిటంటే శారదాంబా వాసుదేవ రావుగార్లు శ్యామలను తమపిల్లలాగే చూసుకుంటున్నారు. శారదాంబగారికి పిల్లలంటే ఎంతోసరదా. నిజంగా ఆమెకంకా నలుగురైదుగురు పిల్లలుంటే బాగుండునని పిస్తుంది. అందుకని శ్యామలను కూడా తనపిల్ల నిర్మలలాగే చూసుకుంటుంది. తన పిల్లలతోపాటు కాఫీ యిస్తుంది. నిర్మలకు కుట్టిచ్చే గౌన్లూ శ్యామలకూ కుట్టిస్తుంది. నిజానికి శ్యామల ఉపభోగవస్తువుల

కమ్మే ఖర్చులో మువ్పాతిక మూడువీసాలు శారదాంబగారిదే. తనకో పిల్లలతోపాటు శ్యామలను కూడా అవసరమైనప్పుడు బజారుకుతీసుకెళ్ళి ప్రతిదీ రెండురెండుకొని ఒకటి నిర్మలకు ఒకటి శ్యామలకు యిస్తుంది. ఇక వాసదేవరావుగారు శ్యామలను తన పిల్లలతోపాటు గుఱ్ఱపుబండిలో బడికి పంపుతారు. తనపిల్లలతో పాటు సాయంత్రం షికారుకు తీసుకెళ్తూంటాడు. సరే పిల్లల విషయంలో చెప్పనే అక్కరలేదు. ముగ్గురిదీ ఒకే ప్రాణం. శ్యామల హృదయాకాశంలో ప్రస్తుతం ఆరే నక్షత్రాలు. వెంకటలక్ష్మి, లక్ష్మీకాంతయ్య, శారదాంబా, వాసుదేవరావు గార్లొక రకమైన ప్రకాశంతోను అంతకంటే ఎక్కువగా నిర్మలా రామకృష్ణలు. ఏమైతేనేం? ఎవనినైతే తొమ్మిదిసంవత్సరాల పాటు తన అర్ధశరీరంగా భావించిందో ఎవనిని విడిచిరాలేక మన్నూ మిన్నూ ఏకమయ్యేటట్లు యేడ్చి తీరా విడిచి వచ్చిం తర్వాత కొన్ని నెలలపాటు జెంగపెట్టుకుని చిక్కిపోయిందో ఆ రాకాసుధాకరబింబం నేడు పూర్తిగా ఛాయారహితంగా అదృశ్యమైంది.

రాత్రి 9గంటలప్పుడు హైస్కూలంతా కెటకిటలాడుతోంది. పెద్దలూ పిల్లలూ తమతమ స్థానాలలో కూర్చున్నారు. కొంతి పిల్లలు "త్వరగా మొదలెట్టాలి" అని కేకలు పెడుతున్నారు. వాళ్ళకోరిక నెరవేరింది. వీణ భంగిమలో పట్టుకుని, పొందికగా కూర్చుంటే సాక్షాత్తు సత్యలోకంలో శారదాదేవి కూర్చున్నట్లే ఉంది కాని శారదకాదు. పదహారేండ్ల శ్యామల. మృదువైన కోమలవేళ్ళతో తంత్రులను మీటుతూ ఆనినాదంలో తన పాంజుల

మనోహర కంఠధ్వనిని కలిపి పాడుతూవుంటే స్వరదేవత నాట్యం చేస్తున్నట్లుంది. శ్రోతల కా గానాంబుధిలో ఒడ్డు దొరకడం లేదు. వీణా తంత్రులతోపాటు శ్యామల ప్రేక్షకుల హృదయ తంత్రులను కూడా మీటుతున్నది. ఉపాధ్యాయులు సైతం నోరు తెరుచుకుని వింటున్నారు. తన ప్రేమపాత్రులైన నిర్మలా రామకృష్ణులు తనముందరే కూర్చుని అత్యంతదీక్షతో తన్నవలోకిస్తూన్నారు.

ప్రేక్షకుల కోలాహల ధ్వనులలో కచేరి ముగిసింది. మిత్రులందరూ తమకు తోచినట్లల్లా పొగడుతున్నారు. చివరకు హెడ్‌మాష్టరుగారు లేచి శ్యామలలాంటి తెలివిగల పిల్లను చలాకీపిల్లను తన అనుభవంలో అంతకుముందు చూడలేదని—నిజంగా అంతచక్కగా ఆపిల్ల వీణవాయిస్తుందని తనువెప్పుడూ అనుకోలేదని చెబుతూ ఆబాలిక యింకా కళాసేవచేసి గొప్ప కీర్తి సంపాదించుకోవాల్సిందిగా హెచ్చరిస్తూ తదభివృద్ధికై ఆశీర్వదిస్తూ ఒకబంగారు పతకాన్ని బహూకరించారు. తర్వాత ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళి పోయారు.

మర్నాడు సాయంత్రం 5గంటలకు నిద్రనుండి లేచిందని తెలుసుకుని నిర్మలారామకృష్ణులు శ్యామల యింటికి వచ్చారు. శ్యామల చాలా నీరసంగా ఉంది. ప్రొద్దున 10గంటలకు వాళ్ళమ్మ బలవంతాన లేపి అన్నంపెడితే, నిద్రపోతూనే తిని కంచంలో చెయ్యికడుక్కుని గభాలున మళ్ళీపడుకుని యింతకుముందే లేచి స్నానంచేసి కాఫీతాగి వసారాలోకి వచ్చేటప్పటికి నిర్మలారామకృష్ణులొచ్చారు. "హల్లో రండి రండి" అంటూ

ఇద్దర్నీ చేతులుపట్టుకుని తనగదిలోకి లాక్కెళ్ళి చెరొకకుర్చీలోకి త్రోసి తానొక కుర్చీలో కూలబడ్డది. "కాఫీ అంతా నేనొక్క-దాన్నే త్రాగేశాను పాపాత్మురాల్ని." "మేమూ త్రాగేవచ్చాం లేవమ్మా ఆమాత్రం కాఫీ". మేమొస్తామని నీవేమన్నా కలగన్నావా శ్యామూ!" "లేదనుకో అయినా అతిథుల్ని సత్కారం చాలిగా కృష్ణా!" "అయితే నాగాడు శ్యామూ! కాఫీ ఇవ్వని నేరానికి కాసేపు వీణవాయించు." "క్షమించు నిర్మలా! హుషారుగా లేదు ఒంట్లో. కాసేపలా షికారు వెళ్ళి వద్దాం పదండి. కొంచెం బద్ధకం తగ్గుతుం దలా తిరిగి వస్తే." అని శ్యామ లనేసరికి సరే అంటే సరే అనుకుని షికారుకి బయలుదేరారు ముగ్గురూ.

ఇప్పుడు శ్యామలానిర్మలలు స్కూల్ ఫైనల్ క్లాస్ చదువుతున్నారు. ఆసంవత్సరంలో ఆక్లాసువాళ్ళంతా ఆస్కూలునువిడిపెట్టి వెళ్తారుగాబట్టి వాళ్ళకులాసా కోసం యేటా మాదిరిగానే ఆయేడుగూడా హెడ్‌మాష్టరుగారు కొన్ని కళాప్రదర్శనాలు యేర్పాటు చేసి, లక్ష్మీకాంతయ్యగారు కాకతాళీయన్యాయంగా బజార్లో కలిస్తే ఆయన అనుమతి తీసుకునే శ్యామల చేత కచేరీ చేయించారు. హెడ్ మాష్టరంత వ్యక్తి వచ్చి అడిగితే ఆయన కాదనగలడా! నిజానికి మనసులో యిష్టం లేకపోయినా!

రామకృష్ణ కాలేజీలో ఇంటర్ సీనియర్ చదువుతున్నాడు. ముగ్గురికీ పరీక్షలు దగ్గరకొస్తున్నయ్యని చాలా జాగ్రత్తగా చదువుతున్నారు.

లోకులు కాకులన్నారు. వాళ్ళనోళ్ళకి అడ్డు లేదు. నరంలేని నాలిక ఎటుబడితే అటే తిరుగుతుంది. ఒక స్కూలు కుర్రాళ్ళ

సంగతి చెప్పనే అక్కర్లేదు. చదువుచెప్పే మేష్టర్లకే వంకలు పెడతారు. సన్నగాఉంటే "స్కెలిటన్"లావుగాఉంటే "ఢమ్మా" పొడుగ్గా ఉంటే "పిరమిడ్" పొట్టిగా ఉంటే "లిల్లీపుట్" ఇలాంటి వెన్నోలక్షలు. భగవంతుడిచ్చిన శరీరాన్ని వడ్రంగి వద్దను తీసికెళ్ళి సరిచేయించుకోటానికి వీల్లేదుగదా. పోనీ మన్మథపరాన తారులే మేష్టర్లుగా వస్తారనుకోండి! బ్రహ్మదేవుడి క్రొత్తస్కీమ్ ప్రకారం. అప్పుడయినా పాపం ఏమాష్టరైనా కొంచెం చక్కగా నిలబడితే "పోజ్ పోజ్" అని గోలచేస్తారు. అల్లరి చిల్లరగా ఉంటే "మంకీ బ్రాండ్" అంటారు. ఇక ఎట్లాచెప్పండి? ఎంత ముసలి మేష్టరికైనా సరే విద్యార్థులు మళ్ళీ చక్కగా బారసాల చేస్తారు. శ్యామల కూడా యీవిచిత్ర నామకరణ జాలంలో నుంచి తప్పించుకోలేక పోయింది. ఒక నాడు శ్యామల ఒకరంగు చీరకట్టింది. మరో రంగుజాకెట్ తొడిగింది. మరో రంగు రిబ్బన్ పెట్టింది. నల్లటి జుట్టూ, తెల్లని శరీరం మొత్తం అయిదు రంగులతో చక్కగా నడుస్తు ఒక పెన్ను పెట్టటంలో పెద్దచెయ్యి కళ్ళలో పడింది. ఇకనేముంది? పక్కవాడితో అనేశాడు "పంచకల్యాణి" అని. ఆరోజునుండి స్కూలుకుర్రాళ్ళందరూ శ్యామలపేరు మార్చేశారు. నిర్మల శ్యామల, రామకృష్ణ కలిసి హైస్కూలులో చదువుతుండగా ఆముగ్గిరికీ కలిసి ఒకఉమ్మడిపేరుండేది "నిశ్యారా" అని. ఏమీ లేదు. వాళ్ళ ముగ్గురి పేర్ల మొదటక్షరాలు కలిపేరు. వాళ్ళు చేసిన ఘనకార్యమంతే. ఇప్పటికే కొన్ని గోడలమీద ఊరులో కష్టపడి వ్రాసిన "శ్యామల X రామకృష్ణ = ?"

అనే సమీకరణపు మాసిపోయినగుర్తులాపడుతూనేఉంటాయ్. దీనికంతా కారణమేమిటంటే శ్యామల ఒక్కసారికూడా యీ శాక్షీరకాల మొహంవైపు చూడకపోవటమే.

శ్యామల వ్యక్తురాలై రెండేళ్ళైంది. ఈరెండేళ్ళనుండీ వెంకటలక్ష్మమ్మ లక్ష్మీకాంతయ్యగార్లు కూడా శ్యామల రామకృష్ణతో కలిసి తిరగటం అయిష్టతగానేవుంది. వెంకటలక్ష్మమ్మగారెప్పుడన్నా "అలాతిరగటంమర్యాదకాదే" అని మందలిస్తే శ్యామలకు కోపంవచ్చి రెండుమూడురోజులపాటు తల్లితో మాట్లాడేదికాదు. అసలు లక్ష్మీకాంతయ్యగారు ఆరెండేళ్ళక్రితమే శ్యామలకు చదువు మాన్పిద్దామన్నాడు. గాని 'స్కూల్ ఫైనలన్నా పూర్తయితే అదోదారిగా ఉంటుందని—తనేమీ కట్నాలూ కానుకలూ యిచ్చేపరిస్థితిలో లేకపోవటంవల్ల చదువు చూసైనా ఎవరన్నా చేసుకుంటారని ఆశపడి పైగా తనమిత్రులు కొందరటువంటి చురుకైనపిల్లకు చదువుచెప్పించటం మంచిదని సలహా యివ్వటంవల్ల అలాచేశాడు. కాని చిన్నప్పటినుండి వస్తున్న సహవాస ధర్మమైనా శ్యామలీనాటికీ రామకృష్ణతో కలిసి తిరగటం ఆయనకయిష్టంగా ఉంది. ఈఅయిష్టతే రామకృష్ణపై చిరచిరగా మారింది. అందుకనే రామకృష్ణ తనయింటికి నిర్మలతో కలిసి వస్తుంటే మొహం చిట్లించుకునేవాడు. నిర్మలదేముంది ఆడపిల్ల. ఆవిషయంవేరు. తను ముందర వెళ్తుంటే కొంటె కుర్రాళ్ళు వెనకనుండి తను వినాలనే ఉద్దేశ్యంతో పెద్దగాఅనే చిలిపిమాటలాయన్ను కలవర పెట్టేవి. ఆయనా మనిషేగా. నిజానిజాలు తెలుసుకునేందు కాయనేం దేవుడా!

ఏదెట్లయినా శ్యామలను రామకృష్ణస్నేహం మాసిపించాలి. అని మనసులో గట్టిగా తీర్మానించుకున్నాడు. ఇందాక రామకృష్ణా నిర్మలలు వచ్చినప్పు డాయనింట్లో లేడు.

సరాసరి శ్యామలా, నిర్మలా, రామకృష్ణలు షికారుకు వెళ్ళి తిరిగి ముగ్గురూ రామకృష్ణ యింటికే వెళ్ళేరు. నిర్మల లోపలికి వెళ్ళింది. రామకృష్ణ, శ్యామలా వాళ్ళ రీడింగ్ రూమ్‌లో కూర్చున్నారు. శారదాంబగారు వంటచేసుకుంటున్నది. వాసు దేవరావుగారింకా యింటికి రాలేదెందుకనో!

'శ్యామా! రాత్రి ఎంతందంగా వాయించావ్. విద్యాదేవత లాఉంది శ్యామా' 'నిజమా కృష్ణా' శ్యామా నేననవసరంగా ఎప్పుడన్నా పొగడగానువ్విన్నావా? అంతేకాదు వ్రేళ్ళతో 'అలా' వీణ మీటుతుంటే నాఒళ్ళు పులకరించింది శ్యామా. నాలుగేళ్ళ లో వీణ యెంతచక్కగా వాయించటం నేర్చుకున్నావ్. అయినా ఆ అందం ఆ ఆనందం వాయించేనేర్పులో కాకుండా ఆ వ్రేళ్ళ ల్లోనే ఉంటుందేమో. ఆ నీమృదువైన వ్రేలికి నేనొక బహు మానమిస్తున్నాను. చూడు శ్యామా! ఇదిగో! యీ ఉంగరం ప్రొద్దున ఎంతో ముచ్చటపడి కొన్నాను అక్కడే 'ప్రే-శ్యా' అనే యీరెండక్షరాలు చెక్కించి తీసుకు వచ్చాను. ఏదీ అని చెయ్యిపట్టుకుని వ్రేలికిపెట్టబోతుండగా తప్పు కృష్ణా! అలా నీవు నావ్రేలికి ఉంగరం పెట్టవచ్చా చెప్పు? అలాంటి అధికారం ఒక్క భర్తకే'. అవును శ్యామా ఆవిషయం నాకు తెలుసు. తెలిసే యీపనిచేస్తున్నాను.' అనేసరికి శ్యామలగుండెలు టక టకమని కొట్టుకోసాగినాయ్' ఎందుకు శ్యామా! అలాకంగారు

పడతావ్. నేను నిజమే చెబుతున్నాను. నాహృదయాన్నిప్పటి కైనా అర్థంచేసుకో శ్యామా! నీతో నేనీ ఆరేళ్ళబట్టి ఎలా ఉన్నానో నీకు తెలుసుగదా! అన్యధాభావిస్తే చెప్పలేనుగాని నిన్ను మామూలు స్నేహితురాలిగా భావించలేదు శ్యామా! అంతకు వేయిరెట్లుగా ఎంచుకుని మనసులో ఎన్నెన్నో కోర్కెలు కల్పించుకున్నాను. నిజంగా నిష్కల్మషంగా నిన్ను ప్రేమిస్తు న్నాను శ్యామా". శ్యామల ఎందుకో వణికిపోతున్నది. అది భయమా! భయపడటానికేముంది దీంట్లో. పోనీ రామకృష్ణ అన్నమాటలకు కోపం వచ్చి కంపిస్తున్నదా! కళ్ళలో కాని మొహంలో కాని అంత కోపచిహ్నలేమీ కన్పించటం లేదే. పోనీ ప్రేమమూర్తి పల్కిన ప్రియవాక్యాలమూలానా ఆకల్గిన ఆనందాతిరేకంచేత వివశత్వం పొందుతూ చలిస్తున్నదా! మొహంలో ఆ ఆనందం కనపడటంలేదే! ఏదీకాదు. అది అంతకు ముందెన్నడూ జీవితంలో జరగని ఘట్టంనేడు జరగటం వల్ల శారీరకవిశేషం, కళ్ళార్పకుండా చూస్తున్నది. మనసులో మాత్రం ఏభావానికీ చోటీయనట్లు స్పష్టమౌతున్నది. ఇంత లోకే నిర్మల వచ్చింది గదిలోకి. గప్‌చిప్ వెనకటి వాతావరణ మంతా మారిపోయింది 'నిర్మలా చూడు శ్యామకి రాత్రి వీణ వాయించినందుకు బహుమతిగా యీఉంగరమిద్దామనుకుంటు న్నాను. నువ్వువచ్చినతర్వాతే యిద్దామని ఆగేను. చూడు దీనిమీద "వీణా" అని చెక్కించాను. ఎందుకో తెలుసా. శ్యామల వీణ వాయించినందుకు గాను యిది బహూకరించ బడిందని అందరికీ తెలియటానికి; రెండు ఇవాళనుండి శ్యామకు 'వీణా" అనే సార్థకనామం క్రొత్తగా నేను పెడుతున్నాను.

ఈ పేరుతో శ్యామ వృద్ధిలోకి రావాలి. తెలిసిందా. "ఓహో! అలాఐతే అదిలాయియ్యి — శ్యామా చెయ్యిటితే" అని నిర్మల మెల్లగా ఆ ఉంగరాన్ని శ్యామల వ్రేలికి పెట్టింది. 'ఎందుకు కృష్ణా ఇంతఖరీదు పెట్టికొని— 'ఊరుకో శ్యామా అంతమాత్రం తాహతుందిలే దేవుడిదయవల్ల. అని నిర్మల శ్యామల వ్రేళ్ళు ముద్దుపెట్టుకుంటున్నది. 'అదేమిటి నిర్మలా చెయ్యి ముద్దు పెట్టుకుంటావ్' నీకేం తెలుసన్నయ్యా. శ్యామలకు పేరు యీ వ్రేళ్ళమూలానే రావాలి. అని చక్కిలిగొక్కు తున్నది. 'సరే టైం ఏడైనట్లుంది వెళ్ళొస్తాను. కృష్ణా వస్తాను నిర్మలా అని శ్యామల యింటికి వెళ్ళి పోయింది.

ఇంటికివచ్చీరాగానే ఎక్కడ కెళ్ళావే శ్యామా, అని తల్లి ప్రశ్నించింది. నిర్మలా వాళ్ళింటి కెళ్ళానని సమాధానం చెప్పింది శ్యామల 'అట్లా వెళ్ళరాదని ఎన్నిసార్లు చెప్పినా వినకొచ్చావేమే నామాట. చదువుకున్నందుకు ఫలితమ టేయిది'. 'ఏం వెళితే తప్పా'. 'అవునుతప్పే' అంటూ నొడ్లో నుండి లక్ష్మీ కాంతమ్మగారు వచ్చి 'ఎన్నిసార్లు చెప్పినా గ్రహించుకోవేమే శ్యామా! మామాట వినదలచుకో లేదా, అని కొంచెం మంద లించేసరికల్లా శ్యామల కళ్ళనుంచి గిర్రున నీళ్ళు తిరిగేయ్, అమాంతం తన గదిలో కెళ్ళి తలుపేసుకుని పక్కమీదపడి ఏడుపు మొదలెట్టింది. "ఇదీవరస చెబితే వినదు. ఏమన్నాంటే ఏడుస్తూ పోయి పడుకుంటుంది. ఎట్లాగో యీపిల్లతో'. 'ఆ విన కేంచేస్తుంది లేవే నాలుగైదు మాట్లుచెబితే' అని లక్ష్మీ కాంతమ్మగారు వక్కాణించమని చెప్పి శ్యామలను కూడా భోజనా

నికి పిలవటానికి గదితలుపులు తట్టేసరికి జ్యోతుల్లాంటి కళ్ళతో వచ్చి తలుపుతీసింది. 'ఎందుకేమ్మా! అలాఏడుస్తావ్! ఏమన్నానే!'. 'ఎవరిష్టమొచ్చినట్లు వాళ్ళల్లాఅన్నారూ! ఇంకా ఏమన్నామంటారు'. 'అదికాదే పిచ్చితల్లి! నువ్వు వాళ్ళతో కలిసితిరగటం ప్రపంచానికి విడ్డూరంగా ఉంటుందే. చిన్నతనంలో దారివేరు'. 'చిన్నతనంలో చెయ్యందేమిటి, ఇప్పుడు చేస్తున్నదేమిటి:'. అలాకాదమ్మా ఊళ్ళోవాళ్ళంతా ఏమనుకుంటున్నారో తెలుసా?'. ఊళ్ళో వాళ్ళంతా అంటే ఇంట్లోవాళ్ళు మీరూ అంటున్నారన్నమాట!'. 'అదేమిటే! ఎంత మనఅన్నం మనం తింటున్నా ప్రపంచానికి వెరవాలి తెలిసిందా'. 'అవును ప్రపంచానికి భయపడి అన్నీమానుకునింట్లో ఒకమూలన గోళ్ళు గిల్లుకుంటూ కుర్చోవాలంటారు. మనవిజ్ఞానమిలా ఉంది కాబట్టే మనదేశం యింత దౌర్భాగ్యస్థితిలో ఉంది. అసలు మనవాళ్ళ నీఅవమాన పిశాచం వదల్నంతవరకు దేశదౌర్భాగ్య స్థితికూడా వదల్దు మన కర్మమింతేలే" "ఎందుకే అమ్మాయ్! ఊరికే లెక్చర్ కొడ్తావ్. అవకాశం ఉన్నప్పుడే అనుమానం బయలుదేరుతుంది. నిప్పులేకుండా పొగరాదు.- పోనీ నువుమంచిదానివే-ప్రపంచమే నీఉన్నత భావాల్నర్థం చేసుకోలేదనుకో అప్పుడైనా నువ్వు ప్రపంచం మాట వినాల్సిందే. ముల్లు వచ్చి అరిటాకుమీద పడ్డా అరిటాకు పోయి ముల్లుమీద పడ్డా నష్టం ఒకదానికేనే. ఎందుకు చెబుతున్నానో తెలుసుకోవే తల్లీ! ఈవిషయం ఆనోట యీనోట పడి చివరకు మాస్కూలు పిల్లల చెవినికూడా పడిందంటే ఇక నేను ఉద్యోగం మానుకుని పోవాల్సిందే. ఒకొక్క స్కూలు కుర్రాడొక్కొక్క రేడియో

అంత పనిచేస్తాడు. ఇన్నాళ్ళబట్టీ నిన్నేమన్నా అన్నామా! ఇప్పుడు చెప్పాల్సిన పరిస్థితులేర్పడ్డాయి కాబట్టి చెబుతున్నామ్. నేముకాకపోతే ఇంకెవరే తల్లీ నీకుచెప్పేది. నీమంచికోసం చెప్పినా నువ్వు గ్రహించుకోపోతేఎలా! నీస్నేహితురాలు నిర్మలను తీసుకువచ్చి 24గంటలు నీగదిలో అట్టేపెట్టుకో. అంతే కాని పరాయి మొగపిల్లవాడితో అలాతిరగటం పరువుగాదే అమ్మా' అని బుజ్జగించి మెల్లగా భోజనానికి తీసుకెళ్ళాడు. మొగపిల్లాడి వాడైనైతే ఒకలెక్కలోది కాదుగాని ఆడపిల్లను సమదాయించాలంటే తలప్రాణం తోక్కొస్తుంది. చదువుకున్న పిల్లయితేమరీ!

మర్నాడు ప్రొద్దున 9గంటల దాకా శ్యామల లేవలేదు. వెంకటలక్షమ్మగారు లేపటానికని వెళ్ళి చెయ్యిపట్టుకునేసరికి ఒళ్ళుసీసంలా కాగుతున్నది. లక్ష్మీకాంతయ్యగారు 7½కే బడికి వెళ్ళిపోయారు. తల్లితట్టి లేపగా శ్యామల మెల్లగా మొహం కడుక్కుని అన్నంపెట్టమంది తల్లిని. ఒకప్రక్క అంత జ్వరంతగిలితే యిప్పుడన్నమెలా తింటావే ఇదిగో కాఫి. మీనాన్న వచ్చిం తర్వాత డాక్టర్ని పిలుచుకొస్తారు. ఇవాళ బడికివెళ్ళొద్దులే అని చెప్పికాఫీయిచ్చి మళ్ళీకూతుర్ని పడుకోబెట్టి దొడ్లో తన పనిమీద వెళ్ళిపోయింది.

ప్రొద్దుననుండి తమయింటికి రాకపోయేటప్పటికి నిర్మలే వచ్చి 'ఏంశ్యామా పడుకున్నావే' అని గాభరాగా అడిగింది. 'ఏంలేదు నిర్మలా కొంచెం జ్వరం తగిలింద' నేసరికల్లా పాపమా స్నేహితురాలు పరుగెత్తుకుంటూ వెళ్ళి తమయింట్లో ఉన్న

జ్వరపుమాత్రలు తెచ్చిస్తూ రామకృష్ణతో శ్యామలకు జ్వరం తగిలిందని చెప్పే సరికల్లా అతనూ పరుగెత్తుకుంటూ నిర్మల వెంబడేవచ్చి 'శ్యామా! జ్వరంతగిలిందా! అరె! ఒక్కరాత్రిలో ఎంతచిక్కిపోయావ్' అబ్బ ఒళ్ళు సీసంలాకాగుతున్నది. ఇవాళ బడికివెళ్ళక' అనిచెప్పేడు. నిర్మలపద్ద మాత్రలు తీసుకుని శ్యామల వేసుకుని 'కృష్ణా కాలేజీకైమైనట్లుంది వెళ్ళిరా' అని చెప్పేసరికి పాపమతను వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళిపోయాడు. తర్వాత నిర్మల కూడా వెళ్ళిపోయింది.

తనమీద యింతభయంకరమైన ఆంక్ష పెట్టబడుతుందని శ్యామల కలలో కూడా అనుకోలేదు. నిన్నసాయంత్రమే రామ కృష్ణ అతని ప్రేమవాహినిని తనపాదాల ముందుగా ప్రవహింప జేశాడు. కాని రాత్రి తను అశ్రువాహినిని ప్రవహింపజేసింది. ఒక్కపూటలోనే యింతమార్పా? కాకేముంది! మానవుల సుఖదుఃఖాలు క్షణక్షణానికి మారుతూనే ఉంటాయ్. అయినా దుఃఖం లేని సుఖానికి విలువలేదు. నల్లటి చీరెమీది తెల్లటి జాకెట్కే రాణింపుజాస్తి. అదే సృష్టిరహస్యం. రామకృష్ణ మాటచొప్పున ఉంగరం వాళ్ళింటో పెట్టుకుందిగా తమయింటికి రాగానే తీసి పెట్టెలో పెట్టింది. ఇప్పుడెవ్వరూలేరు. మెల్లగా పెట్టెతెరిచి తీసింది. ఎంతచక్కగా ఉంది. రామకృష్ణ హృదయా నికి ప్రతినిధాయిది. క్రిందటిరాత్రి తానెంత మనోహరంగా వా యించిందా! తానువాయించగలదా! ఆతనూరికే ముఖప్రీతి కోసం అనలేదుగదా. పాపం అతనలాంటి వాడు కాదే. తనకు రానివిషయాన్ని 'శ్యామా నీకిది తెలియద'ని నిర్మోహమాటంగా

చెప్పేవాడే. ఇంతదేనికి! వీణ వాయించిన కాసేపూ ఆడియన్స్ని నోళ్లుతెరిచి కళ్ళప్పగించారే! నిస్సందేహంగా బాగానవాయించి ఉంటుంది-అందుకనే ప్రాణస్నేహితుడైన రామకృష్ణ యీ ఉంగరాన్ని బహూకరించాడు. దానిపై 'వీణా' అని చెక్కించాడు. ఎందుకని: అది తన కంఠధ్వనిపీ ణా నినాదంలో ఐక్యమైపోయి స్వరలహరిని మూర్త్రీభవింపజేసింది. అందుకుని తనకు వీణా అని పేరుపెట్టాడా? ఎంత చక్కగాఉందా పేరు. అదిపేరుగా ఉండటమేగాకుండా తను వీణ వాయించగలదని కూడా వ్యక్తమౌతుందే. చాలా ఆలోచించే రామకృష్ణ తనకాపేరుపెట్టాడు. నిన్నటినుంచీ అతనలాగే పిలుస్తా డెవ్వరూ లేనప్పుడు. మరి ఉంగరంసంగతో! పాపం తనుచాలా ఆప్యాయంగా యిచ్చాడు. తనూతీసుకుంది. పెట్టుకోకబోతే అతని మనసు కష్టపడదూ! తీరాపెట్టుకుంటే అమ్మా నాన్నా చూచి ఎక్కడిదంటే ఏం చెప్పాలి. రామకృష్ణ యిచ్చాడంటే! అమ్మయ్యో! అసలతనితో మాట్లాడటానికే వీలులేదన్న వాళ్ళిమాట వింటే ఇంకేమన్నా ఉందా. పోనీ నిర్మల యిచ్చిందంటే "అంత విలువగల వస్తువా అమ్మా యెలా యిచ్చిందీ, నువ్వెలా తీసుకున్నావ్. ఎవరన్నా వింటేఏమనుకుంటారు ముందు వాళ్ళది వాళ్ళకిచ్చిరా, అని అనరూ? కాబట్టి ఎందుకైనా మంచిదని యింట్లో ఉన్నప్పుడు దాచేసి వాళ్ళింటికి వెళ్ళినప్పుడు పెట్టుకుందామని అనుకుంటూం డగా పొరపాటున అదిజారి పెదిమలమీదపడి అక్కడనుంచీ క్రిందపడి వంకరపోయింది. వంకర తియ్యటానికి పాపం చాలా ప్రయత్నించింది కాని సాధ్యపడలా. అదెవరన్నా చేతనయిన వాళ్ళు తీయాలి గాని తన వల్లాతుందా!

పదిహేనురోజులైంది. పరీక్షలు జరుగుతున్నయ్ ముగ్గురికీ. నిర్మలాశ్యామలు కలసి శ్యామలయింట్లో చదువుకుంటున్నారు. రామకృష్ణ శ్యామలను చాలా తక్కువగా కలుసుకోవాల్సి వస్తున్నది. ఆరోజు ఆఖర్ పరీక్షవ్రాసి ముగ్గురూ యింటికి వచ్చారు. ఇంట్లో లక్ష్మీకాంతయ్యగారు లేరు. పెన్నూ పుస్తకం తనగదిలో పారేసి వచ్చింది వచ్చినట్లుగా తల్లికుక్కూడా చెప్ప కుండా చెంగుచెంగున లేడిపిల్లలాగా ఎదురింటికి వెళ్ళింది. ముగ్గురూకలిసి పదిహేనురోజులకుగాను మళ్ళీయివాళ వెళ్ళారు. మళ్ళీముగ్గురూ తిరిగి రామకృష్ణ యింటికి వచ్చారు. నిర్మల యింట్లోకి వెళ్ళిపోయింది. రామకృష్ణాశ్యామలలు వాళ్ళ మామూలు గదిలో కూర్చున్నారు. "ఎంత బాగుంది వీణా నీచేతికీ రింగ్" పాపం శ్యామలాఉంగరా న్నెలాగో కష్టపడి ఆవంకర లోనే వేలుకు యిరికిచ్చుకుంది. కానెంత నెప్పిపుట్టిందో పెట్టుకు నేటప్పుడు. ఇప్పటికీ బాధగానే ఉంది. "బాగుంటుంది కాబట్టే ఉపయోగిస్తారు కృష్ణా". "ఈమధ్య మాయింటికి రావటం చాలావరకు తగ్గించావేం". "ఆ! పరీక్షలు గామా! కొంచెం సీరియస్‌గా చదువుతున్నా." "పరిస్థితులు ప్రతికూలించే సరిక సత్యానికి స్థావరమైన నీనాలుక అబద్ధాలను ధ్వనింపజేస్తున్నదా వీణా! నన్నింకాసరిగాఅర్థంచేసుకోలేదా! నాదగ్గరదాస్తావుదేనికి! మీనాన్నావాళ్ళు వద్దన్నారుకదూ! అంతేనా" అని గుచ్చి గుచ్చి అడిగేటప్పటికా ప్రేమమూర్తికి మళ్ళీ అబద్ధంచెప్పి ద్రోహం చెయ్యలేకపోయింది. నిశ్శబ్దంగా తలవాల్చింది. కంటి కొలకుల్లో నీలాలు నిలబడ్డయ్. "అరె అదేమిటి వీణా! ఏడుస్తు

న్నావా! ఎందుకు? ఎబ్బే! తప్పు అదేమిటి" అని కన్నీళ్ళు తుడిచి "చూడు వీణా! అనవసరంగా హృదయాన్ని కష్టపెట్టుకోవద్దు. నేనేమన్నా అనుకుంటానని విచారానికి లోనుగావద్దు. పరిస్థితు లిలా ఉన్నప్పుడు మనమేకాదు, మరోరైతే మాత్రం చేసేదే ముంది చెప్పు. చూడువీణా! ఒక్కవిషయం. నాఅభిప్రాయ మంతా నీకిదివరకే తెలియజేశాను. వయోధర్మంకాబట్టి వినా లని కుతూహలంగా ఉంది. ఒక్కసారి నీనోటితో నీఉద్దేశ్యం కూడా చెబుతావా వీణా!" 'చె-ప్ప-టా-ని కేముంది కృష్ణా'. రామకృష్ణ కుర్చీనుండి లేచి శ్యామల ముందుకు వచ్చి నిల బడ్డాడు. 'వీణాఒ-క్క—'. 'ఏమిటికృష్ణా'!'ఏంలేదువీణా!ప్రేమా మృతాన్ని అధరపాత్రల ద్వారా ఒక్క--సారి' అని శ్యామలను తన బాహుపంజరంలోకి లాక్కోబోతుండగా "లాలా లాలల ల్లాలలా" అంటూ నిర్మల ప్రత్యక్షమైంది. ఇద్దరూ గప్‌చిప్. 'దొంగలు నేనులేకుండా చూసి-' "ఊఁ" కొంచెం రూక్షణంగా అందిశ్యామల. "నామీద చాడీలు చెప్పుకుంటున్నారా" ముగ్గురూ నవ్వుకున్నారు. "సరే వెళ్తా కృష్ణా". "అరే అదేమిటి పరీక్షలైపోయినయ్‌గా. వెళ్ళేంచేస్తావు.' "అయ్యో పాపం పిల్లాజెల్లాని చూసుకోవాలికాబోలు. పోనీ అన్నయ్యా' "ఆహా! నిర్మలకి పిల్లలు కావాలని సర్దాగాఉన్నట్టుంది.' "నాకేంలేదు" "నాకూలేదు' 'లేకపోతే యింటికెళ్తాననెందుకన్నావు?" 'నీకు తెలియదు నిర్మలా! ఏడున్నరైంది. మాఅమ్మా నాన్నా-" 'కొప్పడతారంటేకదూ'. పిచ్చిపిల్ల మాటల ధోరణిలో అసలు విషయం బయటపెట్టేసింది. అయినా సమర్థించుకునే ఉద్దేశంతో 'కొప్పడరనుకో కృష్ణా! ఎదురు చూస్తూంటారు.' 'మాట

తప్పించక.' 'ఎబ్బేలేదు నస్తా' నంటూ లేచి మెల్లిగా వెళ్ళి పోయింది.

౩

రెండు రోజులు అయింది. లక్ష్మీకాంతయ్యగారికి కూడా శెలవలుఇచ్చారు. వెంకటలక్ష్మమ్మగారికి, తల్లి సుబ్బమ్మగారు, కూతుర్నీ, అల్లుణ్ణి, మనమరాల్నీ, సెలవలు ఇవ్వగానే మచిలీ పట్నము రమ్మని ఉత్తరము వ్రాయించింది తనకొడుకు విశ్వేశ్వరంచేత. వెంకటలక్ష్మమ్మగారు కూడా తనతల్లిని, తమ్ముణ్ణీ చూచి చాలారోజులయిందని మొగుణ్ణి బలవంతపెట్టింది వెళ్దాం పదండని. లక్ష్మీకాంతయ్యగారు కూడా చాలా పనులు కలిసివస్తాయని ప్రయాణానికి సిద్ధపడ్డాడు. ఆసంగతి శ్యామలకు చెప్పాడు. "తొందరేం. నాలుగు రోజులుండి వెళ్దాం"మంది. కాని తల్లి బయల్దేరాలిసిందేనని గట్టిగా పట్టుపట్టగా తండ్రి తన్ననేక విధాల బలవంత పెట్టగా తప్పక శ్యామలకూడా సిద్ధపడింది.

ప్రయాణంముందు శ్యామల నిర్మలా వాళ్ళఇంటికి వెళ్ళింది. వాళ్ళందరిదగ్గర సెలవు తీసుకుంది. "సాధ్యమైనంత త్వరలో రావాలిసుమా" అన్నాడు రామకృష్ణ. "ఓ" అంది శ్యామల. "ఓ శ్యామలమ్మా"! అన్న తల్లికేక వినపడేసరికి "సెలవ్" అని వెళ్ళిపోయింది. ప్రయాణమై వెళ్ళిపోయారు.

మధ్యాహ్నం ఒంటిగంటకు మచిలీపట్నం చేరారు. కూతురు, అల్లుడు, మనుమరాలు రానేవచ్చారని సుబ్బమ్మగారు పొంగి పోయింది. అప్పటికప్పుడే కాఫీ పొయ్యిమీద వేసి కూతురికిష్ట

మని అరటికాయ బజ్జీలుచేసి తనకొడుకుతో సహా నలుగుర్నీ ఫలాహారానికి కూర్చోపెట్టింది.

ఒకళ్ళనొకళ్ళు పరామర్శించుకున్నారు. ఒక్క సుబ్బమ్మగారు కురిపించే ప్రశ్నలవర్షానికి ఆముగ్గురూ తట్టుకోలేక పోతున్నారు.

'బావకింకా నాలుగు వెయ్యవే అమ్మా!'

'అబ్బే ఇప్పటికే ఎక్కువైనయ్యాయ్ విశ్వం.'

'నాలుగేమిట్రా? ఇవిగో ఆరువేస్తున్నా.'

'అబ్బేవద్దండీ! తినలేను.'

'ఆ! ఏమీ ఫరవాలేదు. ఏకులు పెడితే బుట్టలు చిరుగుతయ్యా?'

'జోకుచేస్తున్నాడేబావ.'

'నాకెందుకోయ్ జోకు పాతల్లుడికి. రేపు నువ్వోయింటి అల్లుడి వయింతరువాత జోకుచేద్దువుగాని

'మొదట్లో మీరుచెయ్యాలా, అట్లాగే వాడూ చేస్తాడు. తప్పేముంది.' అన్నది వెంకటలక్ష్మమ్మ.

"ఓసి నువ్వు వూరుకోవే!"

'ఏమిటీ! మామయ్యపెళ్ళా? ఖాయమయిందేమిటి?' అని ఆశ్చర్యంగా అడిగింది శ్యామల.

'ఓసి సంగనాచీ! మామయ్య పెళ్ళి నీకు తెలియకుండా

అవుతుందేమే!' అని అంటించింది సుబ్బమ్మగారు.

'మామయ్యా! మమ్మల్ని పిలుస్తావా నీపెళ్ళికి?'

'అసలు నేనేపెళ్ళిదలుచుకోలేదే. ఇంక నిన్నేం పిల్చేది?' అన్నాడు విశ్వేశ్వరం.

ఆమాటకు అందరు ఫక్కున నవ్వుకుని తలోగుక్కెడు కాఫీ పుచ్చుకున్నారు. ప్రయాణపు బడలిక చేత నడుంవాల్చారు.

విశ్వేశ్వరం సుబ్బమ్మగారికి ఒక్కగా నొక్క కొడుకు. తొలికాన్పయిన వెంకటలక్ష్మమ్మగారి తర్వాత పాపం ఆమెకు చాలామంది పిల్లలు పుట్టిపోయారు. ఆఖరుకు పుట్టినవాడితను. ఇతనికి ఇరవైరెండు సంవత్సరాలు. ఇంటర్ సీనియర్ చదువుతూండగా తండ్రి పోయాడు. దాంతో అతని చదువు దెబ్బతింది. తండ్రి బ్రతికిఉండగా బ్రహ్మాని, తిమ్మిని, తిమ్మిని, బ్రహ్మాని చేసి ఏలాగోలాగు ఇతని చదువుకు డబ్బు ఇచ్చేవాడు. వాళ్ళకున్న స్థిరాస్తల్లా ఒక్క ఎకరంనేల. అది అమ్మి అతను చదవదల్చుకోలేదు. అందుచేత తండ్రి తదనంతర విశ్వేశ్వరం చదువుకు స్వస్తి చెప్పాల్సొచ్చింది. ఒక్క సంవత్సరం పాటు టైప్‌రైటింగ్ నేర్చుకుని ఇప్పుడు మచిలీపట్నంలో ఒక టైప్ మిషన్ పెట్టుకుని మంచిప్లీడర్లను పట్టుకుని నెలకు నూరు, నూటఏభై రూపాయలు సంపాయించుకుంటున్నాడు. మనిషి అంతందగాడు కాదు. అనాకారికాడు. తెలివిగలవాడే కానీ పైకి కొంచెం అమాయికుడిలా కనిపిస్తాడు. కొంచెం ముక్తసరి మనిషి.

సాయంత్రం అయిదు గంటలకు విశ్వేశ్వరం, శ్యామల, లక్ష్మీకాంతయ్యగార్లు కాళ్ళుకట్టకేసి షికారు వెళ్ళారు. వెంకట లక్ష్మమ్మ, సుబ్బమ్మ గార్లు పొయ్యిదగ్గరకూర్చుని సంభాషణలు మొదలుపెట్టారు.

'ఏమే అమ్మా! విశ్వం బాగాసంపాయిస్తున్నాడా?'

'ఆ షరవాలేదు. పనిబాగానే వస్తున్నది. నెలకొనూరు నూటయాభైమధ్య చేస్తున్నాడు.'

'మరి ఏమన్నా దాస్తున్నాడా'.

'ఆ!ఏందాపరికం లేవే అమ్మా! కాలు కదిపితే ఖర్చుబస్తీలో. అఎకరంనేల మీద వచ్చే రెండువందలు, వాడి సంపాదనలో నెలకో పాతిక, మొత్తం ఏడాదికో అయిదువందలు వేస్తున్నాడు బ్యాంకీలో. అంటేఈ రెండేళ్ళకు గాను ఒక వెయ్యి వెనకేశాడు.'

'ఆహా! షరవాలా. జాగర్తలో పడ్డాడన్నమాట'

'ఏం జాగర్త లేవే. వాడి సిగిరెట్లకి, కాఫీకి, పత్రికలకి, పుస్తకాలకీ నెలకో ఏభై అవుతవి'

'అంతమాత్రం లేకుండా యీకాలంలో ఉండల్లేవే. ఇంకా వాడు నయంకాబట్టి ఆమాత్రమన్నా వెనకేసుకుంటున్నాడు'.

'మరేమిటమ్మా నీకూతురి చదువు యీఏటికోనన్నా పూర్తవుతుందా?'

'ఆ! పూర్తికామూందే. ఇహ చెప్పించకే లేవమ్మా. స్కూలుఫైనల్ దాకా చెప్పించేటప్పటికే దాదాపు పదిహేను

వందలయిన్నై. అదీకాక నెలకు పదిరూపాయలు చొప్పున ఇచ్చి నాలుగేళ్ళపాటు వీణ నేర్పించాం. రెండు వందల ఏభైరూపాయలు వీణేఅయిందే. ఇంకేం చెప్పిస్తాం చెప్పు. కాలేజీ చదువంటే మాటలా. ఎక్కడనుంచి తెస్తావమ్మా. ఆవచ్చే జీతం డబ్బుల్లోనే అంతా వెళ్ళాలంటే ఎలా? చదువుతున్నదంటే మొగపిల్లాడికంటే ఆడపిల్లఖర్చుఎక్కువే.'

'మీ ఆయన జీతమంతా దానిఖర్చుకే సరిపోతుంది'

'బాగా చెప్పావు. ఇప్పటికి దమ్మిడీ వెనకేసుకోలేదు. వచ్చింది వచ్చినట్లల్లా ఖర్చుచేసుకుంటే పెద్దతనంలో మాకెవరు పెడ్తారే. అందుకనే ఆయనకూడా ఇక మాన్పిస్తానంటున్నారు.'

'ఊఁ ఇంకా ఏమిటె,.

'ఏముందమ్మా మీకు మేమపుపడతామా. ఏమన్నాను. పెద్దోళ్ళువాళ్ళు'.

'అదేమిటేవ్ కూతురా. కొత్తగామాట్లాడుతున్నావు.'

'ఏముందేమ్మా. నేనన్నమాటేంజేశావ్.'

'ఏది పెళ్ళి విషయమేనా!'.

,ఊ!.'

'అదేనా దెప్పిపొడుస్తున్నావ్. నేనెప్పుడనారకాదన్నానా? మీఆయన వచ్చి అడగందే మమ్మల్నే అడగమన్నావా ఏమే. ఆడపిల్లను కన్న తండ్రి ఆయనకే అంత బిగువుఉంటే..,

"ఆ! ఆయనతత్వం నువ్వెరగవుటే? ప్రతిదానికీ బిడియ పడతారు."

"ఓయమ్మ తల్లీ! అంతభయస్తుడయితే కూతురి పెళ్ళేం చేస్తాడేవ్",

"అదికాదమ్మా! నేనూ నాలుగైదుమాట్లు హెచ్చరించాగా! "వాడు బాగా సంపాయించుకుంటూాండే. నాలుగైదువేలు కట్నం ఇచ్చేవాళ్ళే వస్తారూ. ఆటువంటప్పుడు మనం అడిగితే బాగుంటుందా" అని భయపడుతున్నారే."

"తల్లీ! నీకూతురు తగందమ్మా! నాకొడుకు నచ్చుతాడో లేదో"

"దాని మొహం! అంతభాగ్యం దానికిపట్టితే చాలు. అయినా యీరాత్రికి వారితో చెబుతా నిన్నడగమని. విశ్వం ఏమంటాడో!"

"అమ్మాయి! నేను నిజం చెప్తున్నాగా, వాడికికానీ, నాకు కానీ కట్నాల ఆశేమియు లేదు. మీఆయన అడిగితే చేసుకో మని మేమనం. నేనూయీవిషయమే నాలుగైదుమాట్లు వాణ్ణి హెచ్చరిస్తే "చూద్దాంలే కాని అన్నాడేగాని" కాదుపో" అని వాడి నోటిమీాదుగా అనలేదు."

"అయితే ఆయనకీ రాత్రి గట్టిగా చెప్పి నిన్నడగమంటా."

ఇంతలోకీ షికారుకెళ్ళిన ముగ్గురు వచ్చిన సందడి వినబడి సంభాషణ ఆపేశారు.

శ్యామల అదోరకం వ్యక్తి. ఎవరికోసైనా చప్పున అతుక్కుపోయే గుణం కలది. స్నేహితులు లేంది ఒంటరిగా ఒక్కక్షణమైనా గడపలేదు. మామయ్యా మామయ్యా అంటూ విడిచిపెట్టకుండా విశ్వేశ్వరం వెంట తిరుగుతూ తన స్కూలు, తన చదువు విషయాలూ అంతకంటె ముఖ్యంగా నిర్మలా వాళ్ళ విషయాలూ చెబుతూంటుంది. నిర్మలా రామకృష్ణలను విడిచి వచ్చాననే బెంగ కొద్దిగా ఉన్నా తను మొదట్లో అనుకున్నంత తొందరగా వెళ్ళిపోవాలని ఇప్పుడు అనుకోవడం లేదు. విశ్వేశ్వరం కూడా శ్యామల హృదయానికనుగుణంగానే ప్రవర్తిస్తున్నాడు.

మళ్ళీ ఆమర్నాడు సాయంత్రం లక్ష్మీకాంతయ్యగారు శ్యామలా విశ్వంల ఇద్దర్నీ షికారుకు పంపించి తాను మాత్రం యింట్లోనే ఉన్నాడు. మరి రాత్రి పెళ్ళాం ఏమి చెప్పకోరిందో, సరే భార్యతో అత్తగారిని పిలవమన్నాడు. సుబ్బమ్మగారికి అల్లుడీ పూట పెళ్ళివిషయం తనతో మాట్లాడతాడని తెలుసు కాని ఏమీ ఎరగని దానికిమల్లే దొడ్లో ఏదో పని చేసుకుంటూ కూర్చుంది. కూతురు పిలవగానే వచ్చింది.

'ఏమండీ'

'ఊ'

'ఇన్నిరోజులనుంచీ అడగటానికి ధైర్యం చాలలేదు. కాని యిప్పుడు సాహసం చేసి అడగవలసివచ్చింది.'

'ఏమిటది'

'మీ అమ్మాయి చెప్పే ఉంటుంది. పదహారేళ్ళు పెంచాను. స్కూల్ ఫైనల్ దాకా చెప్పించాను. క్షుణ్ణంగా వీణ నేర్పించాను. ఎంతకష్టపడి పెంచుకున్నా ఆడపిల్ల మొగపిల్లవాడు కాదుగదా! ఇవాళ కాకపోతే రేపైనా ఏ అయ్య చేతులోనన్నా పెట్టాల్సిందే. నేనా ఇక పైచదువులు చెప్పించలేను. నా శక్తి వంచన లేకుండా పిల్లకు విద్యాబుద్ధులు చెప్పించాను. కానీ కట్నం కానుక లివ్వలేని స్థితిలో ఉన్నాను.'

'ఆఁ! కట్నాలదేముంది? కావలసినది కుటుంబం కాని'

'ఒకళ్ళకైనా యివ్వగలిగి ఉండే నా ఆస్తే గాని ఆ డబ్బు పెట్టి చదువు చెప్పించాను.'

'అది మంచి పనేగా.'

'చెబితేనేగదే అమ్మా! దాదాపు రెండువేలైనట్టుంది దానికి. మొగపిల్లవాడికి మళ్ళీ ఖర్చు పెట్టాలంటే నమ్మా'.

'ఆ! నాకు తెలియదటే! చదువంటే మాటలా! మన విశ్వానికి చెప్పించలా!'

'పరిస్థితులివి. ప్రయోజకుడైన మనవిశ్వానికి న్యాయంగా మాకంటే పెద్ద సంబంధం వస్తుంది. కాని కలిసిన సంబంధం. పైగా నా పరిస్థితులర్థం చేసుకుని నా కోరిక మన్నిస్తారేమోననే ధైర్యంతో అడుగుతున్నాను. ఆ తర్వాత మీ దయ.'

'ఎంత మాట! కలిసిన సంబంధం నేను మాత్రం పోగొట్టుకుంటానా? నాక్కానీ నాకొడుక్కుగానీ కట్నాలమీద దాహేమీ

లేదు. వాడు చదువుకున్న పిల్లని చేసుకోవాలనే యింతకాలం ఆగేడు. లేకపోతే యింతకు ముందు కావలసినన్ని సంబంధాలు వచ్చాయి. వాటిలో ఏదో ఒకటి ఖాయం చేసుకునేవాడే'.

'అమ్మా! విశ్వానికి నేనంటే ఎంతో ప్రేమ. మా పరిస్థితి తెలుసుకునే వాడిన్ని రోజులుబట్టీ పరాయి సంబంధానికి ఒప్పుకో లేదు. మేమడిగితే వాడుకూడా తప్పకుండా ఒప్పుకుంటాడనే నా ఉద్దేశ్యం.'

'మరి మీ పిల్లను కూడా హెచ్చరించండి!'.

'హెచ్చరించే దేముంది? అది నేను చెప్పిన మాట కాదనదు. పైగా నా యిష్టంతోపాటు తెగలిగిన కోరికంటె అనేక రెట్లు పెద్దసంబంధం కోరినప్పుడు దానికి సంతోషం కాదా! ఆవిషయం దానికి తెలియదూ!'

'నువ్వు చూస్తూనే ఉన్నావుగదే అమ్మా! మామయ్యా మామయ్యా అంటూ వచ్చినప్పటినుండీ వాడి వెంగువదలి పెట్టం దేమో!'

'అమ్మాయ్! నా అభ్యంతరమేమీ లేదు. కావలసి ఉంటే అన్ని విషయాలూ రాత్రి భోజనాలవద్ద మాట్లాడుకుందాం'

'నా తలమీదనుండి ఒకకొండ దింపారు. కృతజ్ఞురాలిని.'

'దానికేమిట్లెండి! మన మేమన్నా పరాయివాళ్ళమా! నా కూతురుబిడ్డను నాకొడుక్కి చేసుకోవటం నాకుమాత్రం యిష్టం కాదూ' అంటూ సుబ్బమ్మగారు చిరునవ్వుతో లోపలికి వెళ్ళి పోయింది.

'అట్లాంటివారిలో చేరండి. ఇన్నాళ్ళూ అవసరమంటే అడిగేరూ?'

'ఊహూ! ఇవాళ్ళడిగేగా!'

'ఆడపిల్లని మటుకు కన్నారు తేలిగ్గా.'

'ఆబుద్ధితక్కువనీదే! ఆడపిల్లని కనమని నేను చెప్పానా నీకు?'

'ఊరుకోండి! ఎవరన్నా వింటే నవ్వుతారు' అని కాసేపా దంపతులిద్దరూ ఎకాచకాలాడుకున్న తర్వాత యికముందు కార్యక్రమంగురించి ఆలోచించుకుంటున్నారు.

షికారుకు వెళ్ళిన శ్యామలా విశ్వేశ్వరంలు వెళ్ళి వెళ్ళి ఒకమైదానంలో కూర్చున్నారు. అంతా యిసుక మయమే. శ్యామల ఊరికే ఆయిసుకను గుప్పిళ్ళతో బట్టి తూర్పార బోస్తూ ఆడుకుంటున్నది.

'శ్యామలా! ప్రకృతినుండి మనం నేర్చుకోవలసినవి చాలా ఉన్నయ్ గదూ!'

'ఉన్నయ్ గాని పూర్తిగా అన్నివిషయాలుగా నేర్చుకోవాలంటే ఒక్కజీవితం చాలదనుకుంటాను మామయ్యా'

'చాలదుకాని తనజీవితకాలంలో నేర్చుకోగలవన్నా నేర్చుకోవటానికి ప్రయత్నంచేయ్యాలి ప్రతిజీవీ.'

'నిజమేకాని మామయ్యా ఒక్కవిషయమడుగుతాను. ఏమీ అనుకోవుగదా!'

'అదేమిటిశ్యామా! నన్ను సందేహిస్తున్నావా?'

'ఏమీ లేదు! స్వతంత్రంకొద్దీ అడుగుతున్నాను. మామయ్యా! ఈడొచ్చినా నువ్వెందుకు పెళ్ళిచేసుకోలేదో చెబుతావా?

'శ్యామా! చాలా పెద్దప్రశ్నే అడిగావు! ఎంతో ఆప్యాయంగా అడిగావు కాబట్టి చెబుతున్నా.

చూడు శ్యామా! ప్రపంచంలో అనేక రకాల దంపతుల్ని చూస్తున్నాం మనం. అందరూ ఆనందాన్నే పొందుతున్నారంటావా? ఏదో ఒకవిషయంలో జుట్టుపట్టుకుంటూనే ఉంటారు. కారణం ఒకర్నొకరు పూర్తిగా అర్థంచేసుకుని వ్యవహరించలేకపోవటమే. కాబట్టి నా ఉద్దేశ్యమేమిటంటే, నాజీవిత వృక్షానికి పెనవేసుకోబోయే లత హృదయాన్నర్థంచేసుకుని నడువగలస్థితి వచ్చేవరకు చేసుకోకూడదని.

శ్యామా! యౌవనోద్రేకానికో మరిదేనికో లోబడి విచారించకుండా పెళ్ళిచేసుకోవటం చాలా తేలిక. పెళ్ళిదేముంది? నిమిషంలో జరిగిపోతుంది. కాని తరువాతేగదా అసలుజీవితమంతా! అప్పుడు సముద్రములోని మర్మాలు తెలియకుండా నావ నడుపబోయే నావికుల లాగా బాధపడతారు దంపతులు. కాబట్టి పెళ్ళి అనేది ఒకకోరికను నెరవేర్చుకునేందుకు సాధనం కాదు. పెళ్ళి ఒకానొక పవిత్రమైన బాస. జీవితమనేది మహా స్థిరమైన ఆనందాన్ని సాధించేందుకు బాట. దంపతులిద్దరూ చేయీచేయీ పట్టుకుని దారితప్పకుండా ఆబాటనే ప్రయాణం చేస్తూ చివరికి ఆనందమనే లక్ష్యాన్ని చేరగలగాలి. అప్పుడే ఆజన్మలు సార్థకమౌతాయి. అంతేకాని ఒకపురుషుడూ ఒక స్త్రీ

కలసి వివాహమనే తెరచాటున తమ పశువాంఛితాన్ని తీర్చు కోవటం పెళ్ళి కాదని నాఉద్దేశం.

"శ్యామా! ఇదుప్పు నన్నర్థం చేసుకున్నావనుకుంటా"

"ఐతే మామయ్యా పొరపాటున నీకు గయ్యాళి పెళ్ళాంమే దొరుకుతుందనుకో అప్పుడు నీజీవితమెలా ఉంటుంది?"

"శ్యామా! గయ్యాళితన మెక్కడుందంటావ్. వ్యక్తిలో లేదు పరిస్థితిలో ఉంది. గయ్యాళితనంగా ప్రవర్తింపజేసే పరిస్థితుల్ని దాటించగలిగితే అప్పుడే ఆగయ్యాళితనం మాయమవుతుంది."

"మరి ఆపరిస్థితుల్ని దాటించగల్గిన ధీరహృదయం కావద్దూ?"

"కావాలనే ఇందాకట్నుంచీచెప్పేది. ఆపరిస్థితుల్ని ఎదుర్కొ-గల స్థిరత్వం హృదయానికి చేకూరేటంతవరకూ పెళ్ళి మానుకోవటమే మంచిది. హృదయానికి పరిస్థితులకీ మధ్య జరిగే భీషణ సంగ్రామంలో హృదయంపగిలిపోకూడదు. పరిస్థితులేక్కి తొలగిపోవాలి. అప్పుడే ఆదాంపత్యం జీవితలక్ష్యాన్ని సాధింప గల్గుతుంది.

"నీహృదయాన్ననుసరించి నడుచుకోగలవ్యక్తి వస్తే నీపెళ్ళి తేలికే అవుతుందేమో!"

"అదినిజమే. అలాకాకపోయినా నేనే ఆవ్యక్తి ననుసరిస్తాను. ఎలాగైనా నాకా-వలసింది జీవితంలోని పవిత్రమైన ఆనందానుభవం."

ఆమాటలు వింటూంటే శ్యామల ముఖంలో ఒకవిధమైన సంతోషం పరిశుద్ధత తొణికిసలాడుతున్నాయ్. ఇన్నాళ్ళు

తనమామయ్య యింత గంభీరుడని తా ననుకోలేదు. నేటితని మాటలు విన్నతర్వాత అతనంటే ఒకవిధమైన గౌరవంపర్పడింది.

"సర్లే సరైంది. వెళ్దామా మామయ్యా?"

'ఓఅలాగే' అని బయల్దేరాడు. ఇంటి దగ్గర బయల్దేరిన తర్వాత యిప్పు డైదో సిగరెట్ వెలిగించాడు.

'ఇన్నిసిగరెట్లు కాలుస్తావేం మామయ్యా?'

'ఏమిటో శ్యామా! అదో అలవాటైపోయింది. కాని యీనాటికైనా నేనిలా కాల్చటమెవరికైనా బాధాకరంగా ఉంటే మానెయ్యగలను.'

మాట్లాడుకుంటూ యిల్లుచేరేరు. శుభ్రంగా వేణ్ణీళ్ళ స్నానం చేసి భోజనాలుచేశారు. శ్యామల వాకిట్లో వేసిన పక్కమీద పడుకుని మేనమామ చెప్పిన విషయాల్ని నెమరువేసుకుంటున్నది. పెళ్ళినిగురించీ, దాంపత్యజీవితాన్ని గురించీ మామయ్యెంత గొప్పగా చెప్పేడు! పెళ్ళి శారీరక సుఖంకోసం కాదంటాడే! జీవితానందాన్ననుభవించేందుకు చేసుకునే ఒకానొకపవిత్రమైన బంధమంటాడే! రామకృష్ణ ఏమన్నాడు? తన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నానన్నాడు. ప్రేమకు నిర్వచనం ఏమిచెప్పాడు? ఊహు. ఏంచెప్పలేదు. నిజానికి తనతో కలిసిమెలిసి ఉండటానికి ఉత్సాహపడేవాడే. తనతో 24 గంటలు కూర్చోమన్నా కూర్చుంటాడు. ప్రేమపూర్వకంగా ఒకఉంగరాన్ని బహూకరించాడు. అయితే బహూకరణలవల్ల ప్రేమకు విలువకట్టవచ్చా? ప్రేమపూర్వకంగా అతనన్నే ఒక్కొక్కమాట ఎంతమనోహరంగా

ఉంటుంది? శరీరం పులకరించేది. అతను తనను నిష్కల్మషంగానే ప్రేమిస్తున్నాడు. అలాగే తనూ ప్రేమిస్తున్నది. అతన్ని తను ప్రేమిస్తున్నది కాబట్టే అతనూ తనను ప్రేమిస్తున్నాడు. కాని మామయ్యేమంటాడు? తనను దూషించేవాళ్ళని గూడా ప్రేమించవచ్చంటాడు. అలా ప్రేమించి ఆ దూషించేవాళ్ళనే తిరిగి ప్రేమించేవాళ్ళుగా మార్చాలంటాడు. నిజంగా దీంట్లో గొప్పతనం లేదూ! మామయ్య యీరకం వ్యక్తేలా ఉండే. ఏమిటో అయోమయంగా ఉంది. మామయ్యంటే ఒకవిధమైన గౌరవం, యిష్టం కలిగినయ్యేగాని అతని భావనా సముద్రంలోని లోతులు తరించి చూడలేక పోతున్నది. ఇంతలోనే ఇంట్లో మాటలు వినిపించేటప్పటికి తన ఆలోచనాతరంగాలొకసారిగా మాయమైనాయి. అస్పష్టంగా వినిపిస్తున్నవి లోపలి మాటలు. 'బావా! మీరింతగా చెప్పాలానాకు? మీ అందరి యిష్టమెలాగైతే అలాగే. మీరూనావాళ్ళేగా!' అన్న మామయ్య మాటలు మాత్రం స్పష్టంగా వినిపించినవి.

లక్ష్మీకాంతయ్యగారు విశ్వేశ్వరంతో కూడా తనసంకల్పాన్ని చెప్పి అతని ఒప్పుదల గ్రహించి ఇక కూతురికి కూడా చెబుదామని వస్తున్నాడు. కాని శ్యామలకు నచ్చచెప్పటం అంత తేలికైనపనికాదని ఆయనకు తెలుసు. కాని కూతురు మనస్సు ప్రశాంతంగా ఉందని విశ్వేశ్వరంవల్ల తెలుసుకుని సిద్ధపడ్డాడు. మెల్లిగా చల్లగా వెళ్ళి పిల్లపడుకున్న మంచంమీద కూచున్నాడు.

'అమ్మా'

"ఏమిటినాన్నా" ఇంతలోకే వెంకటలక్ష్మమ్మగారుకూడా వచ్చినిలబడింది.

"నీకొకముఖ్యమైన విషయం చెప్పాలనుకున్నాను యివాళ్ళ."

"ఏమిటదినాన్నా" శ్యామలకు కొంచెంగా ఏదో తట్టింది. లక్ష్మీకాంతయ్యగారు భార్యవైపోకమారు చూసి కూతుర్ని చేతుల్లోకి తీసుకుని ప్రారభించాడు.

"శ్యామా! నిన్ను కన్నాం. పదహారేళ్ళపాటు కష్టపడి పెంచాం. ఇంతవరకీ ప్రపంచంలో నీమేలుకోరే వాళ్ళల్లో మే మిద్దరం ముఖ్యులం. కష్టపడి చదువుచెప్పించి ఇంతదాన్నిచేశాం. అయినా మాబాధ్యత యింకా తీరలేదు."

తండ్రివిధంగా చెబుతుంటే శ్యామల కాశ్చర్యం కలుగు తున్నది.

'అదేమిటినాన్నా! యివాళ క్రొత్తగామాట్లాడుతున్నావ్'

'అవును తల్లీ! క్రొత్తవిషయంకాబట్టే క్రొత్తగామాట్లాడు తున్నాను. పిల్లలవిషయంలో తల్లిదండ్రులు తీసుకునే శ్రమ చెబితే తెలియదే తల్లీ! అనుభవించాల్సిందేగాని. నువ్వు చదువు కున్నదానివి. ప్రపంచజ్ఞానంకలదానివి. నీ మంచిచెడ్డలు నీవే స్వయంగా చూసుకోగలవుకాని నీవిషయంలోనే నీకంటే బాధ్యత మాకెక్కువుంది. మేమూ పెద్దవాళ్ళమయ్యాం. మన పరిస్థితులు నీకు తెలుసు.'

'నాన్నా అలా జాలిగా చెబుతావేమిటి! అసలువిషయ మేమిటి?'

'అదేమిటో చెప్పటానికేగదే తల్లి వచ్చింది.' అన్నది సంకటలక్ష్మమ్మగారు.

'అమ్మా! ఆడపిల్లలను గన్నవాళ్ళ కష్టాల కేమో యిక్కడ అంతు లేదన్న విషయం నీకు తెలుసు. కాని మేముకూడా ఆడపిల్లను కన్నప్పటికీ మిగతా వాళ్ళలాగా కష్టపడవలసిన అగత్యం తప్ప టంవల్ల ధన్యులం. ఆడపిల్లను యివాళ్ళ కాకపోతే రేపన్నా ఏఅయ్య చేతులోనన్నా పెట్టాల్సిందేగదా! కాబట్టి దీన్ని ఒకింటిదాన్ని చేసి మా బాధ్యత తీర్చుకుందామని ఉంది తల్లీ!' అనే టప్పటికి శ్యామల కన్నివిషయాలూ తేటతెల్లంగా తెలిసినయి. ఎందుకనో మొదట కోపం— అదీ కొద్దిగానే వచ్చిందిగాని తన తండ్రి అలా జాలిగా చెప్పటం ఆకోపాన్ని మాయం చేసింది.

'అప్పుడే పంతొందరలే నాన్నా!'

'అదేమిటే తల్లీ! పదహారో యేడు కూడా వెళ్ళిపోబోతోంటే పెళ్ళికప్పుడే పంతొందరంటావేమే అన్నీ తెలిసిన దానివి.' అని భార్యంటూంటే అందుకుని 'శ్యామా! నువ్వు చిన్నప్పుడు నేననుకున్న ప్రకారమైతే నీకు 11, 12 యేళ్ళకే పెళ్ళి చెయ్యాల్సింది. కాని చురుగ్గా చదువుకుంటున్నావు కాబట్టి తొందరేంలే, స్కూల్ ఫైనల్ కాస్తా అయిపోయిన తర్వాత చెయ్యొచ్చునని యింతకాలం ఊరుకున్నాను. ఆకోరికకూడా తీరింది. కట్నాల కోసం యిల్లువాకిలీ తెగనమ్ముకుని ఎందరు 'అష్టోలక్ష్మమ్మో' అని అలమటిస్తున్నారో నీకు తెలుసుకదా! అటువంటప్పుడు ఆయిల్లూవాకిలీ కూడా లేని నేను కట్నంక్రింద తల యివ్వాల్సిందేగదా!'

'మా పుణ్యం బాగుండబట్టి—'

'చామంతల్లీ! మేమిద్దరం ఏజన్మలో చేసుకున్న పుణ్యమో యిది. మా కోరిక కొండెక్కింది. నీభావిశుభాన్ని కోరి సాహసించి వాళ్ళనడిగేం. నీకంటె మాకీ ప్రపంచంలో కావలసిందేముంది తల్లీ! మేమడిగినట్లుగానే అమ్మమ్మా మామయ్యా యిద్దరూ ఒప్పుకున్నారు. నువ్వంటే మామయ్య కెంత ప్రేమో తెలుసా? నిన్ను చేసుకోవాలనే యింతకాలం ఆగేడు. ప్రతి నెలనెలకీ మనింటికొచ్చేవాడు గదూ! నెలకో నూరు నూటయాభై రూపాయలు తెచ్చుకుంటున్నాడు. మంచివాడు. నిదానస్థుడూ. అన్నిటి కంటె నీహృదయాన్ననుసరించి మసులుకోగల ప్రేమమూర్తి.'

'ఒక ఎకరం నేల కూడా ఉన్నది. అసలు నిజంగా నిన్ను చేసుకోవాలనే యింతకాలం ఆగేడు.' అని వెంకటలక్ష్మమ్మ గారు కూడా ఉడుత భక్తితో తన భర్త ప్రయత్నంలో సాయపడుతున్నది.

'చామంతల్లీ! నాస్థితి ప్రకారం సంబంధం తీసుకరావాలంటే దీంట్లో సహస్రాంశం పోలేదాన్ని కూడా తేలేను. అమ్మమ్మ దగ్గర నీకు కావలసినంత చనువుగదా! సరే. మామయ్య మనస్తత్వం నీకు తెలుసుగదా! అమ్మా! మమ్మల్నిద్దరినీ ఒడ్డున పడేసే సూత్రం కూడా తెలుసుకో! నీమేలుకోరి చెబుతున్నాం. కనిపెంచిన కష్టానికి ప్రతిఫలంగా మా కోరిక చెల్లించు తల్లీ! ఏమంటావ్?'

'ఆలోచించి చెబుతాలే నాన్నా!'

'ఆలోచిస్తానంటే కాదే తల్లీ! లగ్నాలుకూడా త్వరలోనే ఉన్నయ్! ఈ నెలదాటితే యిక ఆరునెలలదాకా వీల్లేదు. నామాట వినమ్మా!'

'నా బంగారుతల్లి వినకేం జేస్తుందండీ! మనల్ని సంతోష పెట్టాలని తెలియదూ మనకన్నతల్లికి!' అని కూతుర్ని ముద్దెట్టుకుంటున్నది. శ్యామ లేదో మహాసముద్రంలో ఉక్కిరిబిక్కిర్లాడుతున్నది.

'అమ్మా! వెళ్ళొస్తా. అమ్మమ్మతో 'శుభం' అనుకునివస్తా.' శ్యామల మాట్లాడలేదు.

'ఏం చిట్టితల్లీ! నాన్ననిగాదూ! నాముద్దుచెల్లించొద్దూ? వెళ్ళొస్తా. ఏం' అని కూతురి చెక్కిళ్ళు నిమురుతూంటే 'మీ యిష్టంనాన్నా' అన్నమాటలు శ్యామల అతికష్టంమీద అనేసిందేగాని కళ్ళనెంబడినీళ్ళు కారుచున్నవి. తలగిర్రున తిరుగుతున్నది. వెంకటలక్ష్మమ్మగారు 'తప్పేతల్లీ! అలాకళ్ళనీళ్ళు పెట్టుకోకూడదమ్మా!' అని తనపవిటిచెంగుతో కన్నీళ్ళు తుడిచి కూతురు తమమాటకు ఒప్పుకొన్నదని చిన్నపిల్లనిలా ఊరికే ముద్దులు పెట్టుకుంటున్నది.

నెలరోజులు గడిచినవి. డాబాపైన వెన్నెల్లో పడుకునుంది శ్యామల. ఇప్పుడు ఆమె మెళ్ళో రెండు క్రొత్తవస్తువులు— ఒకటి విశ్వేశ్వరం పెట్టిన వివాహచిహ్నమైన పవిత్రమాంగల్యం. రెండు సర్కాలా, రామకృష్ణులిద్దరు పెళ్ళిబహుమానంగా పంపిన సన్నని నాజూకైన గొలుసు—ప్రకాశిస్తున్నై. తన జీవితంలో

వచ్చినమార్పును నెమరు వేసుకుంటున్నది. పాపం ఏమిటో ఆవేదనపడుతున్నది. పెళ్ళికి చుట్టాలు చాలామంది వచ్చారు. విశ్వేశ్వరం బ్యాంకులో వేసిన వెయ్యిరూపాయిలు తీసుకుని ఖర్చుపెట్టాడు. శ్యామల కోరుకున్న చీరెలు కొన్నాడు. పాపం బంగారం మాత్రం ఎక్కువ కొనలేక ఒక కల్యాణ ఉంగరం, రెండు జతల గాజులు మాత్రం చేయించాడు. లక్ష్మీకాంతయ్య గార్ని ఇవతలి పుల్లతీసి అవతల పెట్టనీయకుండా పనులన్నీ తనే స్వయంగా చూసుకునేది. వెంకటసుబ్బయ్యగారు కూడా పెళ్ళికి వచ్చి పిల్లకు ఒక కాసు చదివించాడు. శ్యామల మూడు రోజులపాటు వ్రాసి చింపేసి, వ్రాసి చింపేసి చివరకు ఎలాగో వ్రాసి కన్నీళ్ళతో తడిపిన ఉత్తరాన్నందుకుని తాము కారణాంతరాలవల్ల రాలేకపోయినందుకు క్షమాపణ కోరుతూ ఒక చిన్న గొలుసు బహుమానంగా పంపించారు నిర్మలా, రామకృష్ణలు. అంతా యథావిధిగా మర్యాదలతో జరిగిపోయింది. వచ్చిన బంధువులంతా సంతోషంతో వెళ్ళిపోయారు. ఇవన్నీ తలుచుకుని శ్యామల ఊరికే ఆవేదన పడుతున్నది. తాను మొన్న మొన్నటి దాకాఅనుకున్న దేమిటి? ఇప్పుడు జరిగిం దేమిటి? మామయ్యని- పొరపాటు — అమ్మతమ్ముణ్ణి పెళ్ళిచేసుకుంటాననె తానింతకు ముందెప్పుడైనా అనుకుందా! విశ్వేశ్వరం మెల్లగా డాబా మెట్లెక్కి తనవద్దకే వస్తున్నాడు.

"ఏమిటి శ్యామా! ఒక్కదానివే పడుకుని ఆలోచిస్తున్నావ్?" గభాల్ని శ్యామల లేచి కూర్చుని "ఏమీలేదు."

"ఎందుకు శ్యామా! అలా కంగారుగా లేచి కూర్చున్నావ్? నన్నుగురించి నీజీవితంలో క్రొత్త మార్పును తెచ్చిపెట్టానో

అవసరం లేదు. చూడు. బొంబాయిలో ఒకగవర్నమెంటు ఆఫీసులో పనిచెయ్యటానికి మంచి టైపిస్టులు కావాలని ఎడ్వర్టైజ్ చేశారు. కులాసాగా నేనూ అప్లయిచేశాను. గమ్మత్తుగా సెలక్టు చేసిపంపిన అపాయింట్‌మెంట్ ఆర్డర్ ఇవ్వాళే వచ్చింది."

"బొంబాయిలోనా! జీతం?"

"స్టార్టింగు నూటఏభై. యాన్యువల్ ఇంక్రిమెంట్ నాలుగు చొప్పున రెండువందల ఏభైదాకా గ్రేడ్. నీకిష్టమైతే వస్తున్నానని వ్రాస్తాను. కులాసాగా బొంబాయిలో జీవితం గడపాలని ఉంటే చెప్పు!"

"మరిఅమ్మ —అ—హా—హా. అ—త్త—య్య".

"పిచ్చి శ్యామా! ఏమిటా తడబాటు! పుట్టినప్పటినుండి అలవాటైన అమ్మ మ్మనేమాటను మార్చి అత్తగారని క్రొత్తగా అనాలంటే మాత్రం వస్తుందా? అలా అనకపోతే ముట్టుకు వచ్చే ప్రమాదమేమిటి? సరే. అమ్మమ్మనుగూడా అక్కడకు తీసుకుని వెళ్ళడం దేనికి? అక్కయ్య దగ్గరే ఉంచుదా మనుంది. వారి నీఉద్దేశం?"

'నీ— మీ ఇష్టం ఎలాగైతే అలాగేకానీ— యండి'.

'అదేమిటి శ్యామ్! ఒకపనిచేయాలంటే భార్యా, భర్తలు ఇద్దరిష్టము ఉండాలి. అప్పుడే ఆపని నిర్విఘ్నంగా, సుఖాంతంగా జరిగిపోతుంది. ఏమంటావ్? వెళ్దామా?'.

'అలాగే కానీ— యండి'.

'ఏమిటి శ్యామలా! అండీ అని మొదలుపెట్టావ్? నన్ను నువ్వు పూర్తిగా అర్థంచేసుకోలేదా? వెనకెలా నీకు మామయ్యనో ఇప్పుడు అంతే. నీ జీవన వ్యాపారంలో ఒక నమ్మకమైన భాగస్వామి ననుకో. అంతేకాని మీరు, అండీ అని పట్టిపట్టి, ఒత్తి ఒత్తి చిత్రవిచిత్రంగా నన్ను సంబోధించ నవసరము లేదు. కేవలం సంబోధనలవల్ల తృప్తి పడటం కాదు జీవిత లక్ష్యం. హృదయాలనర్థం చేసుకుని ఆనందించటం. సరే. అయితే అమ్మా, అక్కయ్య, బావలతో కూడా మాట్లాడి వస్తా. నువ్విక్కడే ఉంటావా! క్రిందికి వస్తావా?'.

'ఇక్కడే ఉంటా. మీరు వెళ్ళిరండి'.

'మనమిద్దరం కలసి ఉన్న ఈమూడురాత్రులకు గాను వెళ్ళి మళ్ళీరమ్మని ఇవ్వాళ్ళన్నావా శ్యామలా!' అని ఆ ప్రేమమూర్తి మనసారా ఒకసారి తనభార్యను ముద్దుపెట్టుకొని క్రిందికి వెళ్ళి పోయాడు. శ్యామల నాలుక కదుల్చుకుంది. తనన్న మాటకు తనకే సిగ్గు వేస్తున్నది. 'వెళ్ళిమళ్ళీరమ్మన్నానా' పాపం ఆ మాట తలుచుకుని సిగ్గుపడుతున్నది. పిచ్చిపిల్లకు సిగ్గుదేనికి! తననేదేమిటి! ప్రకృతే అలాఅనిపించింది. మళ్ళీఆలోచన పడింది.

మామయ్య మనస్సెంత ప్రేమపూరితమైనది? కేవలం అమృత భాండం లాంటిది. తన ఆనందంకోసం ఎంత ప్రయత్ని స్తున్నాడు! తనని చెప్పింది ఏపనైనా చెయ్యాడట. అలా చేస్తే జీవితానందమే లేదంటాడు. ప్రతిచిన్న విషయానికీ మహత్తరమైన ఉద్దేశం వెలిబుచ్చుతాడు. భర్తననే జౌన్నత్యా న్నిషణ్మాత్ర మైనా ప్రకటించడే! నిజానికి తనుకూడా మామయ్యనంత

ఎక్కువగా ప్రేమిస్తున్నదా? రామకృష్ణా మామయ్యలను పోల్చి చూస్తే తనజీవితపు మేడమెట్లను రామకృష్ణ సగంపైగా ఎక్కేటప్పటికి మామయ్య అట్టడుగు మెట్టుమీదకూడా లేడు. అసలాపరిసరపు నేల మీద కూడా లేడు. ఒక్కసారిగా వచ్చి త్వరత్వరగా ఎక్కి రామకృష్ణతో కలుసుకున్నాడు ఈకొద్దిరోజుల్లో. అక్కడనుండి రామకృష్ణ కదల్లేక పోయాడు. కాబట్టి ఇప్పుడు మామయ్య అతనికంటే ఇంకో మెట్టుపైనున్నాడు. ఇంకా కొద్దిరోజుల్లో సౌధంలో ప్రవేశించవచ్చుకూడా. ఈఆలోచనలతో శ్యామల నిద్రపోయింది. బహుశ ఇంకా నిద్రపోతూనే ఆలోచిస్తున్నదేమో!

విశ్వేశ్వరం తన బొంబాయి ప్రయాణానికి అందర్నీ ఒప్పించి అన్ని ఏర్పాట్లు చేసుకుని తన సర్వస్వం తీసుకుని మంచిరోజు చూసి గుంటూరు బైల్దేరాడు తనవాళ్ళందరితో. రైలు టకటక నడుస్తున్నది. శ్యామల కటకట పడుతున్నదెందుకో! గుంటూరు వెళ్ళాలంటే భయపడుతున్నది. రైలువేగంకంటె హృదయవేగం ఎన్నోరెట్లు జాస్తి కాబట్టి శ్యామల హృదయం ఎప్పుడో గుంటూరు వెళ్ళింది. తనముందుకుర్చీలో రామకృష్ణ కూర్చుని ఏడుస్తున్నాడు. "ఏడుస్తావెందుకుకృష్ణా" అని కళ్ళనీళ్ళు తుడవటానికి ముందుకు వంగింది. ఎదురుగా కూర్చున్న విశ్వేశ్వరం ఒళ్ళో పడింది. ఘుభుక్కున మైకాన్నుండి బైటపడి పాపం తనతప్పు తాను తెలుసుకుని సిగ్గుపడింది. విశ్వం, సుబ్బమ్మగారు కొంచెం కంగారుపడ్డారు. కాని వెంకటలక్ష్మమ్మగారు "అయ్యో తల్లీ! వేళగానివేళలో ఇదేంనిద్రే" అని సమర్థించింది.

కాని అసలువిషయం వెంకటలక్ష్మమ్మ లక్ష్మీకాంతమ్మగార్లకు తెలుసు. తిరిగి శ్యామల గుంటూరు రావటం కూడా వాళ్ళ కంతయిష్టంలేదు. కాని ఎలా? పెళ్ళవగానే కూతుర్ని, అల్లుణ్ణి రెండుమూడునెలలపాటైనా తమ ఇంట్లో ఉంచుకోకపోతే తప్పుగా ఉండదు? చిన్నప్పటినుండి స్నేహం చెయ్యనిచ్చారు. స్నేహానికి వయస్సుతో సంబంధంలేదు. అలా ఉండటానికదే శారీరకమైన దైనేగా! అది కేవలం రెండుహృదయాలకు వేసికట్టిన, ఒకానొక అగోచరమైన పదార్థంతో తయారుచేయబడి త్రెంచ దానికి వీలుకాని ధృఢతరమైన గొలుసు వంటిది. కాని ఆగొలుసునే ఒకప్పుడు విపరీతమైన రాక్షసశక్తిచే త్రెంప దలుచుకుంటే ఏముంది? పెనుతుపానులతో ప్రళయప్రత్యక్షమే! ప్రస్తుతం శ్యామల హృదయంలో అలాంటిప్రళయమే సంభవించింది. "గుంటూరు వెళ్ళకుండా ఏకాయెకిని బొంబాయి వెళ్తే బాగుంటుందేమో!— ఛీఛీ! ఇన్నాళ్ళు సహవాసంచేసి మొన్నటిదాకా హృదయంలో ప్రథమస్థానాన్నిచ్చి నేడు— ఆవ్యక్తినే— తన్నంతగా ప్రేమించిన ఆరామకృష్ణను— తనప్రేమను కూడా గురి— తప్పు ఆమాట ఇంకా అనరాదేమో— ఆవ్యక్తినే ఈనాడు తను మోసం చేసి—అదిచెల్లడించి క్షమాపణ వేడకుండా కనీసం మొహమైనా చూపించకుండా వెళ్ళిపోవటమా! ఇదేనా కృతజ్ఞత? అలా ఐతే ఇంకా ఈప్రపంచంలో స్నేహం, ప్రేమా, కృతజ్ఞతా అంటూ దేనికి? అతనితో అన్నివిషయాలు చెప్పాలి— చెప్పాలా? అమ్మొయ్యో! చెప్పాలా" ఏమిటి! ఏవ్యక్తినైతే హృదయఫలకం స్నేహం, ప్రేమా అనేరంగులతో చిత్రించుకుని నిర్మలనే అద్దంకుండా చూసుకుంటున్నా ఆచిత్ర

మును నేను నేలమీద విసిరికొట్టి ఆ శత,సహస్ర శకలాలను చూస్తూ పైశాచికాట్టహాసం చేసేటంతకృతఘ్నతా వాతావరణం నన్ను క్రమ్మిందా? కృతఘ్నతా? ఒళ్ళు జలదరిస్తుంది. నేనేం పాపంచేశాన్ని? ఒకపురుషుడి భార్యను. పరపురుషుడితో మాట్లాడవలసిన అవసరం? అందుకధికారం? అలామాట్లాడటం స్వపురుషుడిపట్ల మాత్రం కృతఘ్నత చూపించటం కాదూ! ఏమిటో తలతిరుగుతున్నది. బండిమోతతగ్గినా గుండెమోత తగ్గలేదు. అమితంగా కొట్టుకుని కొట్టుకుని అమాంతంగా పగిలి పోదుగదా! బండి గుంటూరులో ఆగింది. ఇంటికి చేరేటప్పటికి రాత్రి ఏడైంది. వెంకటలక్ష్మమ్మగారు నీళ్ళు కాగపెడ్తున్నది. సుబ్బమ్మగారు వంటపని పుచ్చుకుంది. మామగారూ అల్లుళ్ళూ స్నానాలు చేస్తున్నారు. శ్యామల మాత్రం ఏకాయెకిని తనగది లోకి వెళ్ళి పక్కా-పాడు లేకుండానే ఒక మంచంమీద పడి అటూయిటూ దొర్లుతున్నది.

నిర్మల అప్పుడే భోజనం చేసి వీధివాకిలితలుపు తెరిచేసరికి ఎదురింట్లో దీపం వెలుగుతున్నది. ఆపళ్ళ శ్యామా శ్యామాంటూ పరుగెత్తుకుంటూ వెళ్ళి అమాంతం శ్యామలను కౌగిలించుకుని ముద్దుపెట్టుకుంది. శ్యామల గదితలుపు బిగించింది. ఇప్పుడు వాళ్ళిద్దరూ ఒకమంచంమీద పడుకున్నారు. ఒకళ్ళచేతులు మరొకరినిచుట్టినై. ఇంత దేనికి? గది, పది పన్నెండురాత్రులు పురుషుడు విశ్వేశ్వరం అలంకరించిన స్థానాన్నిప్పుడు ఆడపిల్ల నిర్మలాక్రమించింది. వాళ్ళకిప్పుడేం లేదు కద! ఇద్దరాడపిల్లలు కలిసి ఆతలుపులు బిగించుకోవట మేమిటి! వాటేసుకోవటమేమిటి?! ముద్దులు పెట్టుకోవటమేమిటి!— [illegible] ప్రేమ—పిచ్చి.

"ఎంతసేపయింది శ్యామా వచ్చి?" "ఒక్కగంట అవుతోంది. నిర్మలా!" 'ఏమిటి ఒళ్ళింత వేడిగా ఉంది?' "ప్రయాణపు బడలికవల్ల కొంచెం వేడిగా ఉంది." 'అయితే—' 'ఊఁ—కానీ' 'నగావు దేనికి?' 'వాకిట్లో— మంచంమీద— కూర్చొని ఉన్న ఆవ్యక్తి ఎవరు?' 'చుట్టం' 'ఓహో! ఎలాంటిచుట్టమో కొంచెం వివరంగా చెప్పండి శ్యామలమ్మగారూ!' 'మాఅమ్మ తమ్ముడు.' 'ఓహో! నీకేం కానన్నమాట?' 'ఎందుకు కాడు.' 'ఐతే ఏమౌతాడో చెప్పు. నీనోటితో నువ్వుచెప్పాలి. నాచెవులతో నేనువినాలి. ఊఁ— కమాన్.' 'అమ్మతమ్ముడు కాబట్టి మేనమామ.' 'అంతేనా. ఇంకేంకాడా! చెప్పు? సిగ్గొదిలిపెట్టి నివ్వాళ్ళ.' 'అబ్బ మరీ చిన్నపిల్లవౌతున్నావ్ నిర్మలా!' 'నువ్వెప్పటికి పెద్ద ఆరితేరిన దానివి లేగాని చెప్పుమా. ఊరికే అన్నీమాటలు వేయక. లాభం లేదు. చెప్పాల్సిందే.' 'అబ్బ హో నిర్మలా! మా–వా–డు. సరేనా..' 'మీవారా? ఏవారమ్మా? నవారా! తల్వారా!'

నిర్మల చల్లని మాటలవల్ల శ్యామల వేదన కొంచెంతగ్గిందనే చెప్పాలి. మొత్తానికి ఆలోచనా ప్రపంచంనుండి వాస్తవిక ప్రపంచానికివచ్చింది. 'సరేకానీ నిర్మలా! కృష్ణ—.' 'ఆ! చెబుదామనుకొంటుండగానే అడిగావు. ఈమధ్య అన్నయ్యకు కొంచెం సుస్తీచేసింది.' 'అదేమిటి నిర్మలా ఏం? ఇప్పుడు కులాసాగా ఉందా?' 'ఒకవారంరోజులుపట్టి కులాసాగానే ఉంటున్నాడు.' 'మరి సుందో?' 'మనక్లాసు లలిత లేదూ? వాళ్ళనాన్న నిరంజనరావు

గారే మందిచ్చేవారు. అయినా తాగేవాడు కాదు. మందు తాగటానికి ఆవ్యాధి శారీరకమైనదైతేగా? చూడు శ్యామా! ఒక్కవిషయం చెబుతా. కోప్పడవుగదా?' 'నిర్మలా ఆదేమిటలా మాట్లాడుతున్నావు. నిన్ను- నేను- కోప్పడటమా? ఇంతకు ముందెప్పుడైనా అలాంటిది జరిగిందా? ఈనాడు నామీద అలాంటి అనుమానం ఎందుకు కలిగింది? నేనేమీ అనుకోను. ఇదిగో ఒట్టు. అసలుసంగతేమిటో. దాచకుండా చెప్పు.'

'చూడు శ్యామా! యీపూర్వ జన్మసంబంధంవలన మన ముగ్గురం మళ్ళీ ఈజన్మలో కలినాం. ఒకేతల్లి కడుపున పుట్టిన వాళ్ళకంటె ఎక్కువ అన్యోన్యంగా ఉన్నాము. స్నేహంయొక్క లోతులు కనుకున్నాం.

శ్యామా! నాకంతా తెలుసు. తెలియదని మీరనుకుంటారు. చెప్పగూడదుకాని నీవు రేపూరికి వెళ్తాననగా ఇవ్వాళ సాయంకాలం నేను స్నానం చెయ్యటాని కెళ్ళినప్పుడు అన్నయ్యా నువ్వు గదిలో మాట్లాతున్నావు జ్ఞాపకం ఉందా? అప్పుడా సంభాషణాంతంలో నేనక్కడికవచ్చేను! మీ యుద్దేశ్యాలు తెలిసినయ్. అన్న శరీరధర్మానికి లోనైన నీ కుర్చీవద్దకు రాబోవుతుండగా తటాలున నేను వచ్చి ఆపనికి విఘాతం కలిగించాను. అది నాబుద్ధిపూర్వకంగానే చేసాను. ఈవిషయం నేనప్పుడు మీకు చెప్పినట్లయితే నన్నెంత ప్రేమించేవారైనా మీరు నాగొంతు కొరికేవారు. కాని శ్యామా! నన్ను నేను పొగడుకోవటం కాదు కాని చాలా దూరం ఆలోచించి చేశాను. నిజంగా నేను నాడు విఘ్నం కల్పించుటవల్లనే యీనాటి

మీ జీవితాలకు మచ్చ లేకుండా పోయింది. లేకపోతే ఆక్షణిక సుఖంవల్ల మీకీ మిగిలిన జీవితమంతా బాధ పడేవాళ్ళు. నిజానికి ఎంత ప్రేమించుకున్నా వివాహానికి పూర్వమే శారీరకమైన సంబంధమేమీ యుండరాదని నా యుద్దేశ్యం.

శ్యామా! ప్రేమవిషయంలో మీరిద్దరు కొంచెం తొందర పడ్డారనే చెబుతాను. ప్రేమ అనేది ఒకానొక విలువైన బీజం. ఆబీజాన్ని సారవంతమైన క్షేత్రంలోనే నాటవచ్చుగాక. నీటి తెరువు లేకపోయిన తరువాత బీజమెలా మొలుస్తుంది? ఒకవేళ ఆ క్షేత్రంలోఉన్న తేమవల్ల కొంతవరకు పైకివచ్చినా జంతువులు వచ్చి పైకివచ్చిన దానిని వచ్చినట్లులా తినేస్తుంటే ఆ బీజస్థాపన వల్ల లాభం ఏమిటి చెప్పు. అలాగే మీరు మీమీ పవిత్ర హృదయ క్షేత్రాల్లో ప్రథమబీజాలు నాటుకున్నా ప్రోత్సాహం అనే నీటి తెరువు లేక పోయిన తరువాత పవిత్రహృదయాలను అర్థం చేసుకోలేని విజ్ఞాన పురోభివృద్ధి లేని మనుష్యులనే జంతువులవల్ల మీ ప్రేమాంకురం వృద్ధితమౌతున్నదో యున్నట్లుగా ధూపరహితం చేయబడుతుంటే ఫలితమేమిటి చెప్పు. బీజపు విలువకు విలువ ప్రయాసకు ప్రయాస దండుగ. లాభం సున్నకు సున్నా. హళ్ళికి హళ్ళి!

నేనిలా అంటున్నందుకు కోపగించుకోకు శ్యామా! నిన్ను నా అక్కకంటె ఎక్కువగా భావించుకున్నా స్వాతంత్ర్యంకొద్దీ చెబుతున్నాను. మీ జీవితాలు రెండూ ఐక్యం కావడానికి ఏమాత్రం అవకాశం లేదని మీరు మొదట్లో ఆలోచించ లేదు. ఆలోచించక పోవడం కూడా తప్పని నేననను. అది ప్రకృతి ధర్మ

మని నేనూ ఒప్పుకుంటాను. కానీ అక్కా! నేను నామనస్సు విప్పి చెప్పుతున్నాను. దైవసాక్షిగా చెప్పుతున్నాను. నీవివాహం ఇప్పుడైపోవటం చాలామంచిది. నీభావిజీవితానికి చాల సుఖప్రదం. ఇంకా కొద్దిరోజులు పోయినట్లైతే మీరింకా బాధపడేవాళ్ళు. ఇప్పటికింకా అదృష్టవంతులు. అయిందేదో అయింది. ఇప్పటికైనా హృదయాన్ని స్థిమితపరుచుకో. విచారం మానుకో. నీహృదయంలో చెలరేగిన ప్రచండమైన తుఫానుని ఊహించాను. అందుకే నేనిలా చెప్పవలసివచ్చింది. ఇప్పుడు నీమనస్సు కొంతవరకు శాంతించిందని నేను చెప్పగలను.

అన్నయ్యకూడా నిన్ను విపరీతంగా ప్రేమించాడు. ఆప్రేమకు విఘాతంకలిగే అలా మౌనం ఎక్కువలసి వచ్చింది. నీకు చెప్పినట్లే అన్నయ్యకు కూడా చెప్పి చెప్పి ఒకదారికి లాక్కొచ్చాను. ఇప్పుడిప్పుడు కొంచెం నిమ్మళించింది. నిజం చెప్పాలంటే శ్యామా! మీ అసలు అన్నయ్య ఆత్మహత్య చేసుకుంటాడనిపించింది. కాని ప్రతిక్షణం నీకలాగా కనిపెట్టుకుని మెల్లిమెల్లిగా ఒకదారికి లాక్కొచ్చేటప్పటికి తలప్రాణం తోకకు వచ్చింది. చెబితే నమ్ముతావో, నమ్మవో కాని, ఒక్క ఇరవై రోజులపాటు అన్నకీ, తద్వారా నాకూ కంటికి నిద్రంటూ లేదు. చాలా భయపడ్డాను. చివరకు నీకూ, నాకూ భేదం లేదని చెప్పి నన్నిలా చూస్తాడో, నిన్నూ అలాగే చూడమని చెప్పాను. అప్పటికీదారికి రాకపోతే "శ్యామలకీ నాకూ భేదం లేదు. కాబట్టి ఏవిధమైన దురుద్దేశ్యంతో శ్యామలను కోరినా అదినన్నుకోరి నట్లేనని దైవంమీద ఒట్టుపెట్టేసరికి కాసేపు ఆపుకోలేక చెంప

ఘోష్యమనేట్లు కొట్టేను. అయినా నా ప్రయత్నం మాత్రం మానుకోలేదు. కాని తర్వాత పాపం పశ్చాత్తాప పడ్డాడు. కాని నేనలా ఒట్టుపెట్టి తనకెంతో మేలుచేశానని ఇప్పుడంటున్నాడు.

శ్యామా! నీవు పెళ్ళి చేసుకున్నానని విని ఆత్మహత్య చేసుకుందామనుకున్న వ్యక్తిని "శ్యామ నాచెల్లెలు" అని అనిపించాను. ఇకనుండి మనమెవరెక్కడున్నా ఒకతల్లి బిడ్డలనుకోవాలి. నువ్వు నాకు అక్కవి. మనిద్దరికీ రామకృష్ణ అన్న. సరేనా! ఏదీ నువ్వుకూడా "రామకృష్ణ నాఅన్న" అను. ఇప్పటికి నా ప్రయత్నం కొనసాగుతుంది. మనముగ్గురి జీవితాలూ దివ్యమౌతాయ్'.

నిర్మల ఈవిధంగా చెబుతున్నంతసేపూ శ్యామలీ ప్రపంచంలో లేదు. నిర్మలలోక దేవతనీ తానొక విపన్న స్త్రీనీ ఈమాటలన్నీ ఆ దేవత చెప్పే వేదసూక్తులనీ భావిస్తున్నది. ఇప్పుడు తనహృదయం మేఘంలో గాలిలో అలాలా తేలిపోతున్నట్లుగా ఉంది. హృదయమేకాదు. శరీరంకూడా తేలికైపోయి ఆనంద డోలికల్లో ఊగుతున్నట్లుగా ఉంది. ఇందాకటి దాకా రక్తాశ్రుజ్వాలాలైన కళ్ళిప్పుడు శరచ్చంద్ర చంద్రికాధవళితాలైనాయ్. ఆకంటికొలకుల్లోని ఆనందబిందువులు నక్షత్రాల్లా ప్రకాశిస్తున్నాయి. నిర్మలను తదేక దృష్టితో చూస్తున్నది. ఆదృక్కుల్లో ఆనందం ప్రేమ, స్వచ్ఛత, భక్తి అన్నీ ద్యోతకమౌతున్నాయ్. రెప్ప వాల్చకుండా చూస్తూ చూస్తూ ఒక్కసారిగా నిర్మలను గట్టిగా కౌగలించుకుని దీర్ఘంగా ముద్దుపెట్టుకుంది. "నిర్మలా! నువ్వు

సామాన్య స్త్రీవి కాదు. నా పాలిటి దేవతవి. నీ స్నేహం వల్ల నా జన్మ పవిత్రమైంది. నిన్ను 'చెల్లీ' అని పిలవటం నాకే గౌరవప్రదం. నువ్వు నా చెల్లివి. మనిద్దరికీ రామకృష్ణ అ-న్న-య్య."

"అన్నం పెట్టానే అమ్మాయ్" అని వెంకటలక్ష్మమ్మగారు తలుపు వద్దకు వచ్చి కేక వేసే సరికి "అక్కా! ఇక వెళ్ళి వస్తాను. అమ్మ పిలుస్తున్నది. భోజనం చేయి. ప్రశాంతంగా నిద్రపో. రేపు ప్రొద్దున్నే ముగ్గురం కలుసుకుందాం. వెళ్ళొస్తా." అని మెల్లిగా తలుపు గడియ తీసి మెల్లిగా వెళ్ళిపోతూంటే అయాచితంగా వచ్చి వరమిచ్చి తిరోహితయ్యే దేవతా అనిపించింది. అప్రయత్నంగా శ్యామల రెండు చేతులూ కలుసుకున్నాయి. నోటి నుండి 'దేవత' అనే మాట ధ్వనించింది.

శ్యామల రెండు నిమిషాల్లో స్నానం చేసింది. అందరూ ప్రయాణపు బడలికచే ఆపసోపాలు పడుతున్నారుగాని శ్యామల కలాంటి దేమీ లేదు. అంతా భోజనాలు చేస్తున్నారు. ఒక్క సుబ్బమ్మగారు మాత్రం వడ్డిస్తున్నది. శ్యామల పెట్టింది పెట్టినట్లు తినేస్తున్నది గబగబ. తండ్రి ఆశ్చర్యపడుతున్నారు తనకూతురిలోని మార్పుకి. వెలుగు జిలుకగాను శ్యామల మొహాన నిగాళ్ళు కలకల్లాడుతోన్నది. కడుపునిండా అన్నం తింటున్నది. 'శ్యామా! ఇంకా రెండు బీరకాయముక్కలు వెయ్యమంటావా?' 'వెయ్యి' 'ఏమే శ్యామలమ్మా! కూరంతా నువ్వే తింటున్నావే? కాస్త నా తమ్ముడికీ నాకూ కూడా రానీ.' 'ఒసేవ్! నీవి పెట్టి కళ్ళుగాని నేను తిన్నదాకా నువ్వు నత్తలెకపో.' 'తిండిపోతని' అంటారని భయపడి ముందుగానే బావ జాగ్రత్తపడుతున్నా

పక్కయ్యా! గుమ్మడికాయలదొంగ.' 'దొంగవంశం మీదిరా కొడుకా! శ్యామని చేసుకోవాలని మనసులో ఉంటే ఒక్క సారైనా బయటకు వెళ్ళబెట్టావు దొంగవి నువ్వే పైగా మమ్మల్నంటావేం!' 'నాతమ్ముడేమీ ఏరీ కోరీ మోహాన్ని చేసుకోలా. ప్రతిపూటి కాళ్ళుగడిగి నెత్తిన చల్లుకుంటానంటే ఏదోమాటతీసెయ్యలేక 'ఊ' అన్నాడు.' 'ఆలెక్క కొస్తే మానాన్న. కాళ్ళు బాగారుద్ది రుద్ది కడిగి నెత్తిన చల్లుకునుంటాడు మీనాన్న మరిచేపోబోక.' 'కీలరెగి వాతబెట్టావే శ్యామా! ఏమేనూతురా నోరుమూతపడిందేం.' 'అమ్మా మీరు గద్దరి వాళ్ళు. పైగా ముగ్గురు. మేమిద్దరి మిద్దరినే నోట్లో నాలిక లేని వాళ్ళం.' 'ఏనాలికాలేకపోతేనేనా గంటకొట్టినట్లలా వాగుతున్నావ్? సిగ్గులేదేమే మొహానికి."

"నాతమ్ముడి పక్కన కూర్చుంటే మనమ్మాయ్ మొహానికెంత కాంతొచ్చిందో చూడండి' 'జానే కూతురా! గేసు వేస్తు కాదటే అమ్మా మీవి. సిగ్గులేదటే. పాంగోటి టిక్కలక్ష్మీ మొహాలుగా మీరూను. ఎవర్నన్నా అడిగిచూడు. ఎవరి ప్రక్కన కూర్చుంటే ఎవరి మొహానికి కాంతొచ్చిందో'. 'ఎందుకు వూరుకోవే అక్కయ్యా! గద్దరివాళ్ళని చెప్పనేచెప్పావు. మనమూరుకోవటమే మంచిది.' 'గెలువలేకపోయినా నాకింద బలాదూరన్నట్లు మాట్లాడుతున్నారేం నాన్నా!' 'క్రిందపడ్డా గెలుపు నాదే ననే రకం కాదటే తల్లీ!'. 'తమ్ముడోయ్! ఈగయ్యాలి దాంతో ఎట్లావేగుతావో! పూటకు రెండుసార్లున్నా తగల్ని చావో'. 'గంటకే రెండుసార్లుచొప్పున నీకునేనుతగిలిస్తాను.

గ రేనా?' 'వాళ్ళుతింటూనే ఉంటారు. మనమిద్దరం లేద్దామా నాన్నా! ఎంతసేపని కూర్చుంటాం ఐపోయినతర్వాత?' 'ఎందుకే శ్యామా! పాపం కట్టుకుంటావు అబద్ధమాడి! మీకంటె ముందే అయిందిగా నా తమ్ముడిది'. "పోనీ యిద్దరితరఫునా నువ్వే తింటున్నావుగా! కానీ. అత్తయ్యగారు! దాసికి ఒప్పచారుట నాలుగో వాయనంలోకి-నీదేం పోట్టా చెరువా- ఇక లే-అమ్మాయ్! మనమిద్దరం లేద్దాం పా- దాంట్లో కూర్చుంటే కోడికూత వినాల్సొస్తుంది." "ఐపోయింది లెండీ. ఊరికేఆడిపోసు కుంటున్నారుగాని". "ఆగాగుపడిపోతాను. నన్నొకచెయ్యిపట్టుకోనీ!" "నిన్ను నేను పట్టుకుని లేవాల్సొస్తుందేమోబాబా!"? "శ్యామా! ముందు మామయ్యని పట్టుకోమ్మా? లేవబోయి పడతాడేమో!"

అందరూ ఎకచకలు పకల్తో లేచారు. గతరాత్రులలో తాంబూలం కూడా వేసుకొని శ్యామల తానే అందరికీ స్వయంగా నక్క పొడి పెట్టి, ఆకులకు సున్నంరాచి యిచ్చింది. విశ్వేశ్వరం కూడా శ్యామలలోని యీమార్పు గమనించక పోలేదు.

శ్యామల ఎవరూ అడక్కుండా తనంతట తానే గదిలోకి వెళ్ళి గమ్మత్తుగా తలుపు గడియపెట్టి చకచక శ్రుతులు చేసి కల కంఠంతో పంచమశ్రుతిలో మధురగానం. ఆలాపిస్తున్నది. విశ్వేశ్వరానికి తనశ్యామల వీణవాయిస్తుందీ పాడుతుందీ అని తెలుసుగాని యింతకమ్మగా హృదయరంజకంగా ఆ గానం ఉంటుందని తెలియదు. గబగబా వెళ్ళి తలుపులు తట్టగానే "ఎవరో తలుపు తడుతున్నారు. ప్రత్యక్షంగా పాటవింటే

బహుమానమియ్యాల్సి ఉంటుం'దంటూ తలుపు తీసింది. 'పేవవు లున్నంతకాలం బహుమానాలకేం తక్కువ? కావలసినన్ని' అంటూ యిచ్చాడు. శ్యామ ద్విగుణీకృతోత్సాహంతో పాట పాడుతున్నది. వాయుదేవుడీగానామృతాన్ని నిర్మలా రామ కృష్ణలకు సరఫరా చేస్తున్నాడు. శ్యామల వీణమీద గుడ్డ కప్పింది. విశ్వేశ్వరం శ్యామలను కప్పేశాడు. సుబ్బమ్మగా రొక్క మానసికంగాను ఆయింట్లోని తక్కినవలుగురూ అన్నివిధాలా ఆరాత్రి ఆనందపు కొట్టకొన సీమలలో విహరించారు.

మారునాడు పొద్దునే శ్యామల ఎదురింటికెళ్ళింది. ముగ్గురూ గదిలో కూచున్నారు. శ్యామలెందుకో కొంచెం బెరుగ్గా ఉంది. 'బాగా కులాసాగా ఉన్నావా కృష్ణా!' 'ఆ ఫరవాలేదు వీణా! రాత్రివచ్చారటగా?' 'అవును. మీరుకూడా పెళ్ళికి—'. 'వచ్చేవాళ్ళనే కానీ నాకప్పుడే సుస్తీచేయటంవల్ల రాలేక పోయాను. పాపం నిర్మల 24 గంటలూ నన్ను కాచుకూర్చొచ్చె వాలొచ్చేది.' 'నీవు పంపిన బహుమతి ఎంతో ఆప్యాయంగా పెట్టుకుంటున్నాను.' 'నేను కాదే అదేగా వీణా! అసలా ఉద్దేశ్యంతో నేగా పంపింది.' శ్యామల నేత్రాలు చెమ్మగిల్లుతున్నాయ్. పూర్వం విషయాలన్నీ ఒక్కొక్కటే జ్ఞాపకానికి వస్తున్నై. 'నన్ను క్షమిస్తావా కృష్ణా!' 'అదేమిటి వీణా! నన్ను—నేను—క్షమించటమేమ! నువ్వేంతప్పుచేశావు?' 'సామాన్యపు తప్పు కాదు. నిన్ను మోసంచేశాను. నన్ను క్షమించవా?' అంటూ

శ్యామల అతని చేతులు పట్టుకుంది జాలిగా. చెక్కిళ్ళవెంట కన్నీటి బిందువులు జారుతున్నై." 'అదేమిటి వీణా? తప్పు. అలా ఏడుస్తారా! నువ్వుచేసిన తప్పేమిటి! నన్ను మోసగించావా! పొరపాటు. ఇది మోసంకాదు–నీశక్తి కంటె నీవిరుద్ధ శక్తి యొక్క ఆధిక్యత. అది మోసమెలా ఔతుంది చెప్పు.

ప్రపంచమంటేమిటో సరిగా అర్థంచేసుకోలేని వయస్సులో చేసిన పొరపాటు మోసమెలా ఔతుంది? అలాగైతే నీతో స్నేహం చేస్తూచేస్తూ నిన్నొక అగాధంలో దింపటం ద్రోహం కాదూ? ఇందులో ఎవ్వరి పొరపాటూ లేదు వీణా! కాని ఇకముందు యీగతించిన విషయాల్ని జ్ఞాపకం చేసుకు హృదయాన్ని కలత పెట్టుకోవటం మాత్రం పొరపాటు. నిర్మల ప్రతివిషయం నీకు చెప్పేఉంటుంది. ఒకళ్ళ హృదయం మరొకరికి అర్థమైన తరువాత కూడా యీ క్షమాభిక్షల నర్థించటం లేమిటి చెప్పు? మరో విషయం. ఈజరిగిన సంఘటనవలన నాకంటే నువ్వే ఎక్కువ బాధపడి ఉంటావు నన్నుగురించి. అందుకు నేను నిన్ను క్షమాపణ కోరవద్దు? వీణా! గతాన్నమర్చిపోదాం. అదే మనకు చాలా సుఖప్రదం.

వీణా! యీనాడు నేను నీకళ్ళకు కనబడుతున్నానంటే అది కేవలం నిర్మలవల్ల. తన పవిత్రశక్తివల్ల నిర్మల నన్ను మళ్ళీ యీలోకానికి తీసుకు వచ్చింది. విషయాలన్నీ నీకు వివరంగా చెప్పి నీహృదయ భారాన్నికూడా రాత్రి పోగొట్టం దనుకుంటాను. ఈవిధంగా మనిద్దరకు గొప్ప సాయంచేసి మన భావిజీవితాలు సుఖవంతాలవటానికి చాలా ప్రోత్సహించింది.

కాబట్టి నిర్మల ఆశయం ప్రకారం వ్యాద్వరం ఇకముందు అన్నా, వెళ్ళొం'.

ఇంతలోనే సంభాషణామధ్యలో ఇంట్లోకి వెళ్ళిన నిర్మల తిరిగి వచ్చింది. 'సరికానీ వీణా! అడగటం మర్చిపోయాను. రాత్రి అంత కమ్మగా పాడుతున్నా వేమిటి! ఇంతకు ముందు నీ వలా పాడటం నేనెప్పుడు విన లేదు.' "ఆమాత్రం ఊహించలే కన్నయ్యా? మనబావగారు పాడమన్నారు. అదీ సంగతి'

'అబ్బ ఊరుకో నిర్మలా! నీదంతా గోల.' "ఆపాటవిని రాత్రి హాయిగా నిద్రపోయాను.' "నువ్వే కాదన్నయ్యా! ఆయనకూడా.' 'ఏఆయన?' "మీ ఆయన లేమ్మా'' 'నీకూ-ఇలా కొద్దిరోజుల్లోనే వస్తాడులే! ఎక్కడున్నాడో, ఏంచేస్తున్నాడో గాని. సరికానీ నిర్మలా! మరి నీపెళ్ళికి నన్ను పిలుస్తావా?' 'పిలుస్తాగాని నీ కష్టానికి పుట్టే—' 'అబ్బ! ఊరుకో నిర్మలా!' 'ఏమన్నా! నన్నన చ్చేం?'

వాకిట్లో నిర్మలా! నిర్మలా! అనే కేకవినపడే సరికి రా. రా. అనుకుంటూ ఎదురుగా వెళ్ళి నిర్మల ఆపిల్ల సిగ్గుపడుతున్నప్పటికీ గదిలోకి లాక్కొచ్చింది. 'ఇదిగో లలితా! ఇతనే మా అన్నయ్య రామకృష్ణ. తర్వాత ఇదిగో యీమె పేరు శ్యామల. నాకు స్వంతక్క కాకపోయినా అంతకంటెక్కువైంది. నాతోపాటే స్కూలుఫైనల్ చదివింది—అన్నయ్యా! శ్యామా! యీమె పేరు లలిత. డాక్టర్ నిరంజనరావుగారి కుమార్తె. మెట్రిక్కే అపియైంది. మొన్న ముదుకోసం వెళ్తున్నప్పుడు పరిచయమైంది. స్నేహపాత్రురాలు.' అని ఒకళ్ళొకళ్ళకి పరిచయం చేసింది.

శ్యామలా లలితలు కరస్పర్శ చేసుకున్నారు. లలితా రామ
కృష్ణలు నమస్కరించుకున్నారు. తర్వాత వాళ్ళు ముగ్గురివద్ద
సెలవు తీసుకుని శ్యామల ఇంటికి వెళ్ళిపోయింది. 'అన్నయ్యా!
లలితకు అన్నగార్లిద్దరు. ఒకరు హార్మోనియం వాయిస్తారు. ఒకరు
తబ్లా వాయిస్తారు. లలిత చక్కగా పాడుతుంది. వాళ్ళకుటుంబ
మొక సంగీతసముద్రం. 'చాలా సంతోషం. సంగీతమంటే నాకు
చాలా ఇష్టం.' 'ఇరవైనాలుగ్గంటలూ వినమన్నా వింటాడు
మా అన్నయ్య.' 'కళలో ఉన్న మాధుర్యాన్ని గ్రహించగలిగితే
అంతేగదండీ మరి.' తర్వాత నిర్మలా లలితల అనుమతి తీసుకుని
రామకృష్ణ లోపలికి వెళ్ళిపోయాడు.

లలితకూడా స్నేహానికి చాలా ఆరాటపడేవ్యక్తి. నిర్మలతో
తన స్నేహాన్ని కొద్దికాలంలోనే వృద్ధి చేసుకుంది. ఇప్పుడు
కాసేపు తన స్నేహితురాళ్ళతో కులాసాగా కాలం గడుపుదా
మనే ఇక్కడకు వచ్చింది.

ఒక మంచిరోజు చూసి శ్యామలా విశ్వేశ్వరంలు
బొంబాయి బయల్దేరారు. వాళ్ళతోబాటే రామకృష్ణకూడా
'ఫోటోగ్రఫీ' నేర్చుకోటానికి బొంబాయి బయల్దేరాడు. శ్యామల
విశ్వేశ్వరం రామకృష్ణలను ఒకళ్ళ నొకళ్ళను పరిచయంచేసింది.
ఒకళ్ళ నొకళ్ళు బావగారూ అని పిల్చుకుంటారు. వాళ్ళ
ముగ్గుర్ని లక్ష్మీకాంతయ్యగారూ నిర్మలా లలితలు స్టేషను
దాకా పంపించారు. బెజవాడలో ఆబండి దిగి బొంబాయిబండి
ఎక్కారు. ప్రయాణంలో రామకృష్ణ విశ్వేశ్వరాన్ని కెం

సాయపడుతున్నాడు. బండి కదిలింది. ఒక యువకుడు పరుగెత్తుకుంటూ వచ్చి ఫుట్‌బోర్డుమీద కాలుపెట్టి కడ్డీ పట్టుకోబోతూండగా కాలు జారటం- కడ్డీ పట్టుకోవటాని కెత్తిన చేతిని గభేమన్న రామకృష్ణ పట్టుకోవటం ఒక రెప్పపాటులో జరిగేయ్. మెల్లిగా లోపలికి లాగాడు. పెట్టెలో జనమంతా హడావుడిగా చూస్తూనే ఉన్నారు! 'నన్ను రక్షించారు. మీకునా-.' 'ఆ! దానికేమిటి లెండి! తీరా బయల్దేరినతరువాత వచ్చి ఎక్కాలేమిటి?' 'ఇప్పటికాలపు కుర్రవాళ్ళు బండి బయల్దేరినతరువాతగానీ ఎక్కరు. అదొకబడాయి.' అన్నాడామూల కూర్చున్న ముసలాయన. 'పోనీ, మరో బండికి వచ్చేవారు. అంతేగానీ ఇంత సాహసం చేశారేమిటి?' 'ఇక్కడ నాపెట్టెపెట్టి ఇంకా టైముంది గదాని ఒకస్నేహితుడితో మాట్లాడుతూండగానే బండికదిలింది. బండిలో పెట్టెపెట్టకపోతే ఎక్కేవాణ్ణి కాదండీ.' 'ఆస్నేహితుడితో ఎక్కడికో వెళ్ళి మాట్లాడకపోతే ఇక్కడే మాట్లాడరాదూ?' అదొక బడాయ్ అన్నాడా యిందాకటి పెద్దమనిషి. 'ఏమండోయ్! ఇప్పటికి రెండుసార్లన్నారు బడాయి, బడాయని. మరోకసారన్నారంటే ఊరుకోను. తెలిసిందా?' 'ఊరుకోనంటే వేమిటయ్యా? పడ్డట్టయితే?' 'నేనుపడితే నీకేమన్నా దెబ్బలు తగిలేవా.' 'యీకాలపు పిల్లలికి మంచి చెప్పరా దసలు.' 'ఆ మంచిగానే చెప్పరాదూ? బడాయి అంటా వేమిటి?' 'పోనీ వదిలెయ్యాలా బాబూ! నాదే తప్పు. సరేనా! నువ్వు పడితే నాకేం? పోతే నాకేం?' 'ఎవరు ముసలాళ్ళయితే వాళ్ళే ముందు పోతారు'

"మీరు కూర్చోండి మాష్టర్ గారూ! అయ్యో! మీరు కూర్చోండి". అంటూ రామకృష్ణ ఆ యిద్దర్నీ సర్ది కూర్చోబెట్టాడు. "మీరెక్కడికి వెళ్తున్నారు?" "బొంబే వెళ్తున్నానండీ. మీరో?" 'నేనూ అక్కడికేనండీ. మీరేం పని?' 'సౌండుఇంజనీరింగ్ నేర్చుకోటానికండీ' 'అరే! నేనూ ఫోటోగ్రాఫింగ్ నేర్చుకోటానికే వెళ్తున్నాను.' అని రామకృష్ణ ఆశ్చర్యంతో జవాబు చెప్పాడు. "మీ పేరు?" 'కమలనాభప్రసాద్'. రైలుకంటె ఎక్కువ వేగంతో ఒకళ్ళ నొకళ్ళు ప్రశ్నలు వేసుకుంటున్నారు.

ఐదారు సిఫార్సులతో అనేకరకాల హామీలిచ్చిన తరువాత దుర్గాంబగారు తమడాబాగదిని నెలకు పదిహేను రూపాయలచొప్పున సత్యనారాయణకు అద్దెకిచ్చింది. మొన్నటిదాకా ఆగదిలో దుర్గాంబగారికొడుకు కమలనాభప్రసాద్, కూతురు పార్వతి కలిసి చదువుకుంటూండేవాళ్ళు. కొడుకు బొంబే చదువుకి ఖర్చెక్కువ వౌతుంది కాబట్టి కొంతన్నా కలిసివస్తుందని 5వఫారం చదువున్న తనకూతుర్ని ఇంట్లో చదువుకోమని గది అద్దెకిచ్చేసింది ఎన్నో ఆంక్షలు పెట్టి. వాటన్నిటికి ఒప్పుకున్నాడు కాబట్టి, ఒక్కడికిమాత్రమే చాలే ఆగదికి అంత అద్దె ఇవ్వటానికి సమర్థుడు కాబట్టి, సత్యనారాయణకే ఆగది దక్కింది.

శ్యామల వెళ్ళిపోయింతర్వాత సత్యం నెలనాళ్ళు చాలా బెంగపడ్డాడు. కాని చిన్న పిల్లలేముంది! మరో వ్యాపకంలో పడి గతాన్ని విస్మరిస్తారు. తమ ఊరికి రెండు మైళ్ళలో ఉన్న

మరో పెద్దగ్రామంలోని హైస్కూలులో స్కూల్ ఫైనల్ ప్యాసై ఇంటర్ చదవటానికి యీపేడు బెజవాడ వచ్చాడు.

సత్యం చాలా సరదా గల యువకుడు. ఎప్పుడూ నవ్వుతూనే ఉంటుం దతని మొహం. చదువు విషయంలో చాలా జాగ్రత్తలో ఉంటాడు. ఏరోజు పాఠం ఆరోజున కచ్చితంగా చదివేస్తాడు. తెలుగులోమాత్రం అతనికి సహజమైన ప్రతిభ ఉంది. స్కూల్ ఫైనల్ చదువుతూండగానే మంచి మంచి వ్యాసాలు వ్రాసి పత్రికలకు పంపుతూండేవాడు. నిజానికి ఇప్పుడతని కో కొద్దిపాటి లెక్చరర్ కి వచ్చినంత తెలుగు వచ్చు. అందుకనే సత్యం అంటే అతని తెలుగు లెక్చరర్ మాధవరావు గారికి ప్రాణం. ఎన్నో తెలియని విషయాలు సత్యానికి చెప్పాడు. అతని రూమ్‌కు వస్తూంటాడు. అతన్ని తనయింటికి తీసుకెళ్తూంటాడు. సత్యం మేష్టర్లతో అంత సన్నిహితంగా ఉండటం చూసి దుర్గాంబగారి కత నంటే సదభిప్రాయం కల్గి తద్వారా గౌరవంగా ఉంటూ మొదట్లో అతనియితివృత్తం తెలియక పెట్టిన ఆంక్షల్లో ఒక్కొక్కటే రద్దుచేయ సాగింది. ఆమెభర్త బ్రతికుండగా ప్లీడరుగుమాస్తా అయినా చిన్న ప్లీడరంత పని చేసేవాడు. ఆయిల్లూ—పాతిక వేలరూపాయల రొఖ్ఖం స్వయంగా సంపాదించి రెండేళ్ళ క్రితమే యీ అవకతవక ప్రపంచాన్ని విడిచి వెళ్ళాడు. అప్పటినుండీ దుర్గాంబగారే ఆడపనీ, మొగపని చూసుకుంటూ సంసారాన్ని చాలా జాగ్రత్తగా వెళ్ళబోసుకొస్తున్నది. పిల్లల్ని పెంచటంలో ఆమె కామే సాటి. కావాల్సినవి ఒక్కటి కూడా లోటుచెయ్యదు. అక్కడ్లేని

వాటికి హరిహరాదులు సిఫార్సుచేసినా అనుమతి ఇవ్వడు. అందుకనే తండ్రి లేకపోయినా పిల్లలు అల్లరి చిల్లరగా తయారు కారు. చదువువిషయంలో వాళ్ళకి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని చ్చింది. అందుకనే కొడుకుని బొంబాయ్ పంపించింది. కూతుర్ని 5వ ఫారం చదివిస్తున్నది.

రాత్రి 8 గంటల వేళ. కాలేజీలో అనార్కలి. నాటకం జరుగుతున్నది. పాత్ర నష్టంచేసుకుని నటించటం మంటే ఏమిటో ప్రేక్షకులకు వ్యక్తం చేస్తున్నాడు సలీమ్ పాత్రధారి సత్యం. తన స్వర్గజ్యోతి, హృదయాధిదేవత అనార్కలి పదసాన్నిధ్యంలో తన ప్రేమవాహినిని ప్రవహింపజేస్తున్నాడు. ఆచూపుల్లో వ్యక్త మయ్యే నిష్కల్మష ప్రేమా, ఆదేహావిన్యాసంలో గోచరించే గాటమైన వలపు, మాటల్లోని మాధుర్యం, కంటూంటే, వింటూంటే "హమ్మ! సత్యనారాయణ ఇంతవాడా!" అనుకుంటు న్నాడు ప్రిన్సిపాల్‌గారు. 'ఇన్నిరోజులబట్టీ కాపరం చేస్తున్నా ఒక్కనాడుకూడా ఇంత ఆనందంగా ఇంట్లో గడపలేకపోయానే!' అనుకుంటున్నారు కొందరు లెక్చరర్లు. మాధవరావుగారు మనస్సులో ఏమిటో గర్వపడుతున్నారు. ఆయనప్రక్కనే కూర్చున్న రాజాగారు చిరునవ్వుతో రెప్పార్పకుండా చూస్తు న్నారు. నాటకం ప్రేక్షకుల కరతాళధ్వనులతో ముగిసింది. మాధవరావుగారు రాజాగారితో లోపలికి వెళ్ళి సత్యంను కౌగలించుకుని "నీ నేడుద్దేశ్యాలతో యీనాటకాన్ని వ్రాశానో అవన్నీ ద్యోతక మయ్యేటట్లు నటించావ్. నీకు నాశుభాశీస్సులు సత్యం!" అంటే 'నాదేముంది మాష్టరుగారూ! మీరు చెప్పి

నట్లుగా నటించాను. పొగడ్తలు మీ కేదకార్యాలికానీ నాకొద్దు' అని చెప్పి మొహానికి కొబ్బరినూనె రాసుకుని శుభ్రంగా కడుక్కొని వచ్చాడు. 'చూడు సత్యం! వీరు రాజా రామచంద్ర రావుగారని హరిపురం జమిందారుగారు. గొప్పధనవంతులు. కళాభిమానులు. ఈవూరిలో కళాస్యందన మనే నాటకసంస్థను స్థాపించి నిజమైన కళాభివృద్ధికి పాటుపడుతున్నారు. నేనువ్రాసిన నాటకాల్నే ప్రదర్శిస్తారంటారు. అసలు విషయమేమిటంటే, నీనటన చూచి చాలా మెచ్చుకున్నారు. నిన్నుకూడా తమ సంస్థలో ఒక సభ్యుణ్ణిగా తీసుకోవాలని ఉత్సాహపడ్తున్నారు. కళాదేవికి ముద్దులకొడుకువి కావాలంటే చూడుమరి." అని విషయమంతా చెప్పేశాడు. 'దాని కేమిటి లేండి! తప్పకుండానూ. అంతటివారు నన్ను మెచ్చుకోవటమే కాకుండా నాకళాభివృద్ధికి తోడ్పడతా మనటం నాభాగ్యం.' అని చిరునవ్వుతో తన సమ్మతిని తెలియచేశాడు. రాజాగారు సంతోషంతో వాళ్ళిద్దర్నీ తమకార్లో ఎక్కించుకుని దారిలోనే ఉన్న ఎవరింటివద్ద వారిని దింపి మరునాడుసాయంత్రం తమ రిహార్సల్ హాలుకి వారిద్దరినీ కల్సి రమ్మని చెప్పి వెళ్ళిపోయారు.

సత్యనారాయణ ఆగదిలో ప్రవేశించి యిప్పటికి సంవత్సరం పైన ఆరునెలలైంది. ఇప్పుడతను దుర్గాంబగారికి నిత్యమిూది దేవత. తన కుటుంబ పరిస్థితు లన్నీ చెబుతుం దతనికి. అతనిఇంటి వ్యవహారాలన్నీ తెల్సుకుంటుంది. తనఇంట్లో ఎప్పుడైనా బొట్టెముక్క కాలిస్తే అతను కాలేజీనుండి రాగానే పిలిచి పెట్టేదాకా వచ్చింది వ్యవహారం. అతను సీనియర్ చదువు

తున్నాడు. తన కూతురు పార్వతి స్కూల్ ఫైనల్ చదువు తున్నది. పార్వతికి సబ్జెక్టు లన్నీ బాగానే వచ్చుగానీ షాపం లెఖ్ఖల్లోనూ, తెలుగువ్యాకరణంలోనూ వెనకపడింది. పరీక్షలు దగ్గిరికి వస్తున్నాయనిభయపడుతున్నది. ప్రైవేటు చెప్పించుకుంటా నని తల్లితో చెప్పింది. కాని ఆమేం తెలివితక్కువదా? ఏణ్ణార్థం బట్టీ తరచి తరచి నిష్కల్మష గుణ శీలాలు పరీక్షించి నిప్పు వంటివాడని తెలుసుకున్న సత్యనారాయణను చెప్పమన్నది. అతనూ సరే నన్నాడు. అతనికీ పరీక్షలు దగ్గర కొస్తున్నాయి గాని మొదట్నించి చాలా జాగ్రతగా ఉంటున్నాడు గాబట్టి పరీక్షల్ని మంచినీళ్ళప్రాయంగా తలుస్తున్నాడు. అయినా రాత్రిళ్ళు తను చదువుకుంటూ పగటిపూట దుర్గాంబగారి ఎదుట పార్వతికి చెబుతున్నాడు.

రామకృష్ణ, కమలనాభ ప్రసాదు లిద్దరు ఒకే ఇన్‌స్టిట్యూట్ లో చేరారు. ఒకే ప్రాంతంవాళ్ళని ప్రిన్సిపాల్ వాళ్ళిద్దరికి హాస్టల్‌లో ఒకే గది ఇచ్చాడు. ఈరెండేళ్ళలో వాళ్ళ స్నేహం ఇంతింతని చెప్పటానికి వీలులేనంత ధృఢత్వాన్ని పొందింది. ఒక్కమాటలో చెప్పాలంటే కృష్ణార్జునుల్లా ఉంటున్నారు. శ్యామల విషయంలో విశ్వేశ్వరం ఎంతో జాగ్రత్తగా ప్రవర్తిం చేవాడు. చిన్నమెత్తు లోటైనా కల్గించేవాడు కాదు. వచ్చే జీతం దాదాపుగా కుటుంబఖర్చులకు సరిపోయేది. శ్యామల కొంచెం దూబరాగా ఖర్చుపెట్టేది. భార్యనిమిత్తం విశ్వేశ్వరం సిగరెట్లు కాల్చటం కూడా మానేశాడు. ఉన్న యెకరం పొలం

అమ్మివేశాడు. తల్లికి మాత్రం నెలకో పదిహేను రూపాయలు పంపించేవాడు. నెలరోజులుబట్టీ మలేరియా జ్వరం పట్టుకుని అతన్ని పీల్చి పిప్పి చేస్తున్నది. ప్రాణాలు కళ్ళల్లో ఉన్నయ్. డాక్టర్ ఎన్నిమాత్రలు చెప్పినా అతని కానీళ్ళు సరిపడలేదంటాడు. చివరకు బొంబాయి విడిచి వెళ్ళడం మంచిదని సలహా ఇచ్చాడు.

ఎటు తిరిగి విశ్వేశ్వరం అంతకంటె చేయగలిగిందీ లేదు. చివరకు మంచంనుండి లేవలేని పరిస్థితిలో ఉన్నాడు. అటువంటి వాడు మళ్ళీ పుంజుకుని ఆఫీసుకి వెళ్ళటం ఎప్పుడు? ఈ నెల రోజులబట్టీ రామకృష్ణ అతనిని కంటికి రెప్పలాగా కాపాడేవాడు. కొన్నిరోజులు కాలేజీకూడా మానేశాడు. అతనుకూడా ఇంటికి వెళ్ళి పోవటమే మంచిదన్నాడు.

రామకృష్ణ, కమలనాభప్రసాద్‌ల పరీక్ష లయిపోగానే శ్యామలా విశ్వేశ్వరంలతో సహా నలుగురూ గుంటూరు వచ్చేశారు. విశ్వేశ్వరంని చూడగానే అతనితల్లీ, అక్కా, బావా గుండెలు బాదుకున్నారు. అంత జబ్బు చేస్తే తమకెందుకు తెలియ పర్చలేదన్నారు. తనకొడుకును బొంబాయ్ తీసుకు వెళ్ళి పుట్టెడు రోగంతో తీసుకు వచ్చిందనీ, పైగా నానా షోకులకు పోయి ఎకరం పొలం అమ్మించిందనీ, శ్యామలను చూస్తే సుబ్బమ్మగారు కారాలు మిరియాలు నూరుతున్నది.

రామకృష్ణ కమలనాభప్రసాదును తనఇంటికి తీసుకువెళ్ళాడు. అతనా ఇంటి కంతకుముందు రెండు మూడుసార్లు వచ్చాడు. వాసుదేవరావుగారు కూడా అతని రాకకు చాలా సంతో

పించారు. నాలుగురోజులుండి ప్రసాద్ తిరిగి బెజవాడ వెళ్ళి పోయాడు.

తర్వాత ఒకనాడు వాసుదేవరావుగారు రామకృష్ణగదిలోకి వచ్చారు.

'ఏమిటి కృష్ణా! ఆలోచిస్తూ పడుకున్నావ్?'—

'ఏం లేదు నాన్నా!'

'ఈఏటితో కోర్సు అయిపోయిందిగా? మీదటికి ఏంచేయ దలుచుకున్నావ్?'

'మెడ్రాస్ వెళ్ళి ఏస్టూడియోలోనన్నా అసిస్టెంటు ఫోటో గ్రాఫర్‌గా పని చేద్దామనుకుంటున్నాను. నాస్నేహితుడుకూడా అదే ఉద్దేశ్యంలో ఉన్నాడు.'

'మరీ సంవత్సరం పెళ్ళిప్రయత్నాలు చెయ్యనా? ఒక్క విషయం- డాక్టర్ నిరంజనరావుగా క్నెరుగుదువుగా! ఆయన గారు మొన్న నాస్నేహితు డొకడితో అన్నారట- నిర్మలతో పాటు మనింటికి వస్తుందే, ఆయనకూతురు లలితనేమ్మాయి- ఆపిల్లను నీకిస్తే బాగుంటుందని. ఆయనగారివిషయం నీకు తెలుసుగా? చాలా పేరుపడ్డ వ్యక్తి. మంచివాడు. నువ్వు సరేంటే నేనుకూడా ఆస్నేహితునితో కొంచెం సందిచ్చి మాట్లాడుతాను. ఏమంటావ్?'

'మీయిష్టప్రకారం చెయ్యండి నాన్నా! మరి నిర్మలవిషయం ఏమన్నా ఆలోచిస్తున్నారా?' అసలదేమంటుంది? ఇంక చదువుతా నంటుందా?'

'ఆవిషయంకూడా ఆలోచిస్తున్నాను. కాని ఎక్కడా సరైన సంబంధం కనపడలేదు. చదువుకుంటూ నంటేమటుకేం? ఇప్పుడు డాక్టరుగారైనా పెళ్ళి చేసిన తర్వాతకూడా ఆఅమ్మాయి చదువుకుంటానంటే చదివిస్తానన్నారట. ఆడపిల్లకు పదునెనిమిదవ ఏటన్నా పెళ్ళిచేయకపోతే ఎలా? కాబట్టి దానికీ నీకూ కలసి ఒక్కసారే రెండు సంబంధాలూ నిశ్చయించుకుని చేద్దామని నాఆలోచన. కాని అమ్మాయికెక్కడా దొరకలేదు సరియైనది.'

'నాఉద్దేశ్య మొకటి నాన్నా! మన ప్రసాద్ ఉన్నాడే- నాస్నేహితుడు-అతను చాలామంచివాడు. అతనికి బెజవాడలో ఒకయిల్లు దాదాపు ఇరవైఐదువేల రూపాయలబ్యాంకు ఉంది. నీకు తెలుసుగా సౌండ్ ఇంజనీరింగ్ కోర్సు పూర్తిచేశాడు. ఇకముందు అతని జీవితంకూడా నాజీవితంలాగే ఉంటుంది. కాకపోతే అతనికి తండ్రిలేడు. పెండ్లీడుకు వచ్చిన ఒక చెల్లెలు మాత్రం ఉందట. అతనికి మన నిర్మలనిస్తే బాగుంటుందని నాఉద్దేశ్యం. పైనంతామీయిష్టం అనుకోండి. ఊరికే విషయం చెప్పాను మనిషిమాత్రం చాలామంచివాడు. వృద్ధిలోకి వచ్చే వాడు.'

'అలాగా? ఆవిషయం నా కతనున్నప్పుడు చెప్పలేదేం? అమ్మాయిని చూశాడా అసలు?'

'చాలాసార్లు చూశాడు. అప్పుడప్పుడు మాటలసందున అతనిఉద్దేశ్యం కనిపెట్టాను. ఒక్కవిషయం నాన్నా! నిజంగా మీకు నిర్మల నతని కివ్వాలంటే అది నిమిషాల్లో జరిగిపోతుంది. నేను చెప్పినమాట అతని జీవితంలో కాదనడు. కారణం మీకు

చెప్పాను ఒకసారి. అతను రైలెక్కి పోవటం.' 'ఓహో సరే. అయితే ఫర్వాలేదు. ఆ స్త్రీకూడా మనకంటె తక్కువేం లేదు. ఇవ్వాదగ్గ సంబంధమే మరి. ఎటు తిరిగీ మీరాయిద్దరూ ముందు నాటికి మెడ్రాస్ వెళ్తారుగదా! పెళ్ళాలతో సహా వెళ్ళండి. మీరటు సంపాయిస్తూండండీ, వీళ్ళిటు చదువుకుంటుంటారు.' అని చిరునవ్వుతో వాసుదేవరావుగారు అంటూంటే 'ఏమిటినాన్నా! పెళ్ళివిషయాలు మాట్లాడుతున్నా?' రంటూ, నిర్మల తండ్రి కూర్చున్న కుర్చీకమ్మిమీద వచ్చి కూర్చుంది.

'ఏముంది మీవిషయాలే!'

'ఓహో! అన్నయ్యపెళ్ళి విషయమా? కాబోయే వదినను అన్నయ్యకంటే ముందరనుండి నేనే ఎరుగుదును.'

'ఆలెక్కకొస్తే రాబోయే బావమరిదిని నీకంటె ముందరనుండి అన్నయ్యే ఎరుగు.'

'అదేమిటి!?'

'ఏమీలేదు. నిర్మలా! నీకిష్టం కానిది కాదుగాని మొన్న మనింటికి రాలా—'

'అవును లలిత—'

'కాదు. కమలనాభ—' అని రామకృష్ణ అంటూండగానే నిర్మల సిగ్గుపడి పారిపోయింది గదిలోనుండి.

దుర్గాంబగారు వడ్డిస్తున్నది. పార్వతీ కమలనాథప్రసాద్‌లు భోజనంచేస్తున్నారు.

'ఏరా! చదవట మైపోయింది. పెళ్ళి యీయేడైనా చేసుకుంటావా?'

'కాస్త ఇరవైఏళ్ళు ఒచ్చేసరికి పెళ్ళి పెళ్ళంటూ మొదలు పెడతారెందుకే?—'

'అయితే అసలు చేసుకోవా? బ్రహ్మచారిగానే ఉంటావా ఏమిటి చెప్పు?'

'ఏదో ఆఅవస్థంతా నేనుపడతాగాని కాస్త నెయ్యివెయ్యి'.

'పెద్దవాళ్ళైనతర్వాత మాట వింటారుట్రా మీరు? నువ్వు చేసుకున్నాసరే, మానుకున్నాసరేగాని, పార్వతికి మటుకు ఈయేడు చేసెయ్యాల్సిందే. అది స్కూల్ ఫైనల్ దాకా చదువుకుంటానంది. అన్నంతవరకు చెప్పించాను. ఇక చల్లగా ఏఅయ్య చేతిలోనైనా పెడ్తాను.'

'ఊహూ! స్కూల్ ఫైనల్ చదివినంతమాత్రాన పండితురాలైపోయిందంటావ్. కాబట్టి యింకా చదువెందుకంటావ్. అంతేనా?'

'చదివి చదివి నువ్వయ్యావుగా నాయనా పండితుడివి. ఇంకా అదికూడా ఎందుకు? బొత్తిగా లేదనకుండా కొంతవరకు చెప్పించాను. దానికీ పదహారు వెళ్ళి పదిహేడో ఏడు రాబో

తున్నది. ఇంకా ఎప్పుడు పెళ్ళి? అందుకనే యీయేటిలో తగిన సంబంధం చూసి ముడిపెట్టేస్తాను. నాగొంతులో ఊపిరుండగానే ఆకాస్త చేసేస్తాను. ముందు కుంటానో ఉండనో!'

'ఏం ఫరవా లేదు. నూరుసంవత్సరాలలో ఆఖరు సెకండుదాకా బ్రతుకుతావ్. ఏం భయంలేదు పూర్ణాయుర్దాయంనీది!'

'నువ్వేన్నన్నా చెప్పరా! ఈయేడు దానిపెళ్ళిచేసి తీరవలసిందే. అంతగా సరదాగా ఉంటే ఆనచ్చే మొగుడే చెప్పించుకుంటాడు చదువు. నువ్వొప్పుకుంటే ఆవచ్చే సంబంధాలలో యేదో ఒక మంచిదాన్ని చూసి నీకూడా చేసెయ్యాలనే ఉంది. ఆనక నీయిష్టం. అప్పుడే పెద్దవాడివైపోయావ్. నామాట వింటావా పెడతావా? నిజానికి మీనాన్నగారే ఉంటే యేనాలుగేళ్ళక్రిందో మీకు పెళ్ళిళ్ళు చేసెయ్యకపోయారా? ఆడదాన్ని కాబట్టి నన్ను చెవులుపట్టుకు ఆడిస్తున్నారు'.

'సరే. మజ్జిగపోయ్ చెబుతా. నిన్నెవరూ చెవులు పట్టుకు ఆడించటంలేదు. నీమాట యింతకుముందెప్పుడూ వినకుండాపోలేదు. పెళ్ళివిషయంకాబట్టి - అదీ పార్వతివిషయంగాదు- నావిషయంలో నాయిష్టమొచ్చినట్లు చేసుకోవాల్సిందే. తర్వాత ఏమనుకున్నా సరే—'

'అయితే దానిపెళ్ళన్నా యీయేడు చేశెయి.'

'నేను చేసేదేమిటి? సంబంధం యేదన్నా ఖాయం చేసుకో. డబ్బు నాకివ్వు. బజారు కెళ్ళి నీకావలసిన పెండ్లిసంభారాలన్నీ కొనుక్కొచ్చి పెడతాను'.

'ఇంత పప్పుసుద్ద కింటావు! సంబంధం నేను వెతకక్కర్లేదా? బిడియమన్నా లేదేరా అమ్మా టనటానికి? ఇంటికి మొజమానినై యుండీ చెల్లెలికి సంబంధం నువ్వెతకాలా? ఆడదాన్ని నే నెతకాలా?'

"నన్ను వెతకమంటా వేమిటే—పెళ్ళివిషయాలలో నాకు తూర్పు, పడమరా తెలియదు. ఒకళ్ళింటికి కెళ్ళి ఎట్లా మాట్లాడాలో తెలియదు. అస లింతకీ నువ్వాగు చెబుతాను— అన్నాయ్! నువ్వీ యేడు ప్యాసవుతావా!"

"ఓ కచ్చితంగా!"

"ఎందుకు కాదు? పాపం ఆఅబ్బాయి పుణ్యమంటూ రోజుకు రెండు గంటలూ, మూడు గంటలూ తనచదువు మానుకుని తెలియనివన్నీ అరటిపండు ఒలిచి చేతులో పెట్టినట్లు విమర్శగా చెబితే పేసు గాక పీసౌతుందా యేమిటి? యేమీరాని మొద్దుకు నాకే అర్థమయ్యేది పాపం అతను చెబుతూంటే. ఆపరీక్షలకు వెళ్ళినట్లయితే నేనుకూడా అయ్యేదాన్నే. అసలు నువ్వెప్పు డన్నా చూశావా అతన్ని?"

"ఏదీ ఎప్పుడు చూశానే? నేను వచ్చేటప్పటికే అతను వెళ్ళి పోతూవుండె, నిజమా యీయేడూను. ఆ—స రేగాని, మరి ఇది కాగానే యింటర్ చదవాలనుందా?"

"ఎందుకు చదవను?"

"అదింకా చదవాలో దేవుడా అంటూంటే నువ్వు పెళ్ళి చెయ్యాలో భగవంతుడా అంటా వేమిటే!"

"ఓకేయ్! ఆమాత్రం తెలియని పిచ్చిపక్షిని కాదురా నేను. నా చెవులూ కంసాలే కుట్టేడు. అటే పది సంబంధాలు చూసి దల్చుకోలేదు. నిజాని కీయేడు దాని పెళ్ళి చెయ్యాలనీ నాకు లేదు. కానీ ఒక్కటే ఒక్క సంబంధం చూడదల్చుకున్నాను. అది ఖాయమైందా, నాచిట్టితల్లి రత్నాల రాసుల్లో పొర్లాడిం దన్నమాటే."

"ఏమిటేవ్ ఎక్కడి సంబంధం, ఏమిటాకథ? చెప్పు—ఒక పక్కపలు కిటు పడేసి—."

"అమ్మాయి! ఆకంచాలు కడుగు తీసే.— శుభ్రంగా తోముకురా. సరిగ్గా తోమక జిడ్డుపట్టినయి. ఆజిడ్డింకా యీపూట వదలించ''ని చెప్పి పార్వతి దొడ్లోకి వెళ్ళిపోయిన తర్వాత మొదలు పెట్టింది.

'చూడు నాయనా! మన డాబాగదిలో అద్దెకుంటున్నా డంటినే [illegible] అబ్బాయి—అతన్ని నువ్వు చూడ లేదు? చూస్తే బాగుండేది. ఎంతచక్కనివాడురా? ఎంత తెలివైనవాడు? ఎన్నెన్ని కథలు వ్రాసి పత్రికలకు పంపుతూంటా డనుకున్నావు? అతని కచ్చగా మాష్టర్లతో స్నేహం. ఈయేటితో F. A. ఐపోయిందనుకో. ముందుకు B. A. కూడా యీవూళ్ళోనే చదువుతాడట. అతనికోసం మొన్న ఒకరాజుగారుట కాబు పంపించారు. ఇక ఆస్తిచూద్దామా పదెకరాల మెట్ట, ఇరవై యెకరాల మాగాణీ ఉన్నదట. సాలీనా ఖర్చులు పోను 15 వేలు వస్తుందట. ఒక్కడుట. అన్నిటికంటె ముఖ్యంగా ఎంత మంచివాడురా! ఈయేడు పార్వతి ప్రైవేటానికి అతనే

కారణం. నాకు జ్వరం తగిలినప్పుడు నువ్వాకుచ్చుంటూపుట్రా అంత ఆదుర్దాగా? ఎందుకనో ఆ అబ్బాయంటే నా ప్రాణాలు లేచివస్తవి. ఆ ఒక్క సంబంధం చూడాల నుంది.'

'ఎంతాశే అమ్మా నీకు? అలాగే చూద్దాంగాని మా తాత, మీ తాత సంపాయించిం దేమన్నా ఒక యాభై వే లుంటే చూడు కట్నానికి'.

'పిచ్చినాయనా! ఆమాత్రం ఆలోచించకుండా ఉండలేదు కోయ్! కట్నాల కాశపడే రకం కాదని అతనే చెప్పాడు. అత నేమన్నాడో తెలుసా? 'మాకు లేకనా యింకోళ్ళని దేబిరించటం'—అన్నాడు. పాపం ఆమాట యీమాట మాట్లాడుతూ అతని మనసులో ఉద్దేశమంతా తెలుసుకున్నాగా. పిల్లచదువు పున్నదయి తనకు నచ్చితే సరి చేసుకుంటానన్నాడు. మనమూ తగినంత యీలేక పోయినా బొత్తిగా యివ్వలేకుండా ఉండ లేముగదా! మీనాన్న వ్రాసిపోయినట్లు దానికి పెళ్ళికి కట్నం అందగాని ఖర్చుకిందగాని 10 వేలున్నవిగదా! పైగా యింకో విషయం నేను జాగ్రత్తగా గ్రహించానుగా— అతనుపైకేమీ కనబరచలేదుగాని మనం అడిగితేమటుకు కాదనేట్టుగా లేడు. కాబట్టి మంచిరోజు చూసి ఒకపూట వాళ్ళవూరు వెళ్ళి వద్దాం. అతన్నడిగి తెలుసుకున్నాలే ఎలా వెళ్ళాల్సిందీ. పొద్దున వెళ్ళి సాయంకాలానికి తిరిగి రావచ్చు. ప్రయత్నించి చూద్దాం. దేవుడిదయవల్ల కార్యం పండయిందా, మనమ్మాయిపంట పండిం దన్నమాటే! ముందర సంబంధం ఖాయం చేసుకున్నామంటే ఆనక పెళ్ళెప్పుడు చేసినా దిగుల్లేదు. పెళ్ళయినా అతనూ

చదువుకుంటాడు B. A. దాకా. అత నిష్టమైనంతకాలం మనమూ చెప్పించవచ్చు. తెలిసిందా? ఇన్ని ఆలోచించి యీ ప్రయత్నం పెట్టుకున్నాను. ఏమంటావు మరి?'

'సరే. అలాగే కానీ.' అంటూ కమలనాభప్రసాద్ బయటికి వెళ్ళిపోయాడు.

ఇంతలోకే పార్వతి కంచాలు శుభ్రంగా తోమి తోమి కడుక్కువచ్చింది. 'ఇంతసేపు చేశావేమే తల్లి!' అంటే 'నువ్వేగా శుభ్రంగా తోముకు రమ్మన్నావు?' అని పార్వతిఅంటే 'ఓహో! ఔనులే. అన్నాను.' అంటూ తను వడ్డించుకోబోయింది. పాపం ఆపిల్ల కర్థంగాలా అమ్మవాలకం.

విశ్వేశ్వరం శారీరకంగా కొంచెం కులాసాగానే యున్నాడు కాని మానసికంగా బాధ పడుతున్నాడు తన ఆర్థిక పరిస్థితిని తలంచుకుని. ప్రస్తుతం తానేమీ సంపాదించే పరిస్థితిలో లేడు. మందులకని మాకులకని లక్ష్మీకాంతయ్యగారు చాలా డబ్బు తనకింద ఖర్చు పెడుతున్నారు తనవద్దేమీ లేకపోవటంచేత. 'నాకొడుకును బలవంతపెట్టి బొంబాయి తీసుకువెళ్ళి ఆ యెకరం నేల కాస్త అమ్మించి వృట్టెడు జబ్బుతో యింటికి తీసుకువచ్చా' వని సుబ్బమ్మగారు శ్యామలనుదెప్పిపొడుస్తుంటుంది. విశ్వేశ్వరంకు ఇది మరీ బాధాకరమైంది. అన్నిటికీ కారణం తనరుగ్మతేగదాని ఎప్పుడూ విచారిస్తూ కూచుంటాడు.

లలితా శ్యామలల మధ్య కూడా స్నేహ మిప్పుడు వృద్ధి పొందింది. ఒకరోజు బలవంతంమీద నిర్మలతో శ్యామలకూడా

లలితయింటికి వెళ్ళింది. అప్పుడు లలిత అన్నలు కేశవరావు, నారాయణరావులు హార్మోనియం, తబ్లాను వాయిస్తున్నారు. లలిత స్నేహితురాళ్ళిద్దరినీ చేతులు పట్టుకుని ఆగదిలోకి లాక్కెళ్ళిముందు తా నొకపాట పాడి తర్వాత శ్యామలను పాడమని బలవంత పెట్టింది. సహజంగా శ్యామల అంతగా సిగ్గు పడే వ్యక్తి కాకపోయినా తొలిసారి వెళ్ళటం కాబట్టి కొంచెం బిడియ పడుతున్నది. 'పాడమ్మా! ఫర్వాలేదు.' అని ఆ అన్న దమ్ములు కూడా అనేసరికి శ్యామల పాడక తప్పిందికాదు. ఆ అన్నదమ్ములిద్దరు 'సెభాష్! ఇన్ని నాటకాలకు వాయించినా ఒక్కనాడు కూడా యింత కమ్మగా పాడేవాళ్ళకి నేమెప్పుడు వాయించలేదు. ఇవాళ మాచేతులకు పూర్తిగా మెరుగు పెట్టావు. ఇంకొకటి—ఇంకొకటి' అంటూ తమకు చేతులూ శ్యామలకు కంఠం నెప్పి పుట్టిందాకా వాయించిపాడించారు. 'ఇంతే అనుకున్నావేమో అన్నయ్యా! మాస్నేహితురాలు వీణ ఎంత గొప్పగా వాయిస్తుందో తెలుసా?' అని లలిత అంటూంటే 'ఏమమ్మా! మాకొక్క సారి వినిపిస్తూ?' అని ఆ కళాప్రియులు బ్రతిమాలారు! లలితబలవంతమీాదా, నిర్మల సలహామీాద వాసుదేవరావుగారింట్లో ఆరోజు సాయంత్రం వీణ వాయించటానికి శ్యామ లొప్పుకుంది.

మాటప్రకారంగానే విద్యారాణివలె వాయించింది శ్యామల. రామకృష్ణ, విశ్వేశ్వరం, కేశవరావు, నారాయణరావు, లలిత, నిర్మలలు చుట్టూ కూర్చున్నారు. ఒకరి నొకరు యింతకుముందే పరిచయం చేసుకున్నారు. కేశవరావు విశ్వేశ్వరంతో 'అన్నయ్యా గారూ! యింత మహోత్కృష్టమైన కళను జనబాహుళ్యానికి

ప్రదర్శింపకుండా దాచిపెట్టుకోటం న్యాయం కాదు. అది కళా దేవతను బంధించటం. అందు కామె కన్నీళ్ళు కారుస్తుంది. కళా దేవత కన్నీళ్ళు మానవుల శాంతిసౌఖ్యాలకు తిలోదకాలు. కాబట్టి మీరు నన్నపార్థం చేసుకోకుండా ఉంటే ఒకచిన్న విషయం చెబుతాను. మాఅన్నదమ్ము లిద్దరం బెజవాడలో ఒక రాజాగారు స్థాపించిన కళాస్యందనం వారిచ్చే ప్రదర్శనాలకి వాయించుతూంటాం. పతనావస్థలోఉన్న కళాదేవతను తిరిగి మహోన్నతస్థానాన్ని చేకూర్చటానికి నడుంకట్టుకున్న నిజమైన కళాప్రియులా రాజాగారు. తన సంస్థలోని కళాకారు ల్నందర్నీ తను కన్నబిడ్డల్లాగా చూసుకుంటారు. వారికి రెండేళ్ళబట్టి చేదోడుగా ఉంటున్నాం. పూర్తిగా అర్థంచేసుకున్నాం. సంస్థలో అన్ని వాయిద్యాలూ ఉన్నయికాని ఒక్క వీణే తక్కువైంది. కాబట్టి మీరేమీ అనుకోకుండాఉంటే 'ఆవూరూ, ఆవూరూ' తిరుగుతూ నాటకాలకు వాయించటమూ"? అనే దురభిమానం అడ్డురాకుండా ఉంటే మీరీ కళామూర్తిని వెంటబెట్టుకుని వస్తూండండి. ప్రతిప్రదర్శనానికి ఏభైరూపాయల చొప్పున యిచ్చే బాధ్యత నాది. ఇంత మహోత్కృష్టమైన కళను ప్రకాశింపజేయక పోవటం మంచిదికాదు. నామాటవినండి. మీసోదరుడిలాగా చెబుతున్నాను.

ఇప్పుడు చూడండి. మాకు లేక నేనా పిలిచిన చోటికెల్లా హార్మోనియం, తబ్లా వేసుకుపోవటం? దేవుడిదయవల్ల మా నాయనగారు కావలసినంత సంపాయిస్తున్నారు. కాని కారణం? సంగీతకళలో ఉండే అభిరుచి, ప్రేమ. మిమ్మల్ని అరచేతుల్లో పెట్టుకుని తీసుకువెళ్ళి మళ్ళీయింటిదగ్గర దించుతూంటాం.

ఏమంటారు? బహుశ మీకు తెలిసే ఉంటుంది. రామకృష్ణరావు మా కాబోయే బావమరిది. అతనికీ మీకూ కల ప్రాణ స్నేహాన్ని పురస్కరించుకునే నే నిలా అడుగుతున్నాను. ఏమంటారు?'. ఈమాటలు వింటూంటే విశ్వేశ్వరానికి ఆనంద బాష్పాలు జారుతున్నయి. 'తన భార్య అంత చక్కగా వాయిస్తుందా? దేశం తన భార్యలో ఉన్న కళావైదగ్ధ్యానికి జోహారు చేస్తుందా? తానిప్పటి దాకా ఏవిషయానిని గురించి బాధపడుతున్నాడో ఆ ఆర్థికలోపం సవరింపబడేట్టుగా ప్రదర్శనానికి ఏభైరూపాయ లిప్పిస్తా నంటున్నాడే! అతణ్ణి భగవంతుడే పంపించాడా!' అనే ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరవుతూంటే అతని నోటినుండి అప్రయత్నంగా 'అలాగే కానియ్యండి' అన్నమాటలు వెలువడినై. 'అన్నీ బాగానే ఉన్నయ్ కాని, ఇకముందు మాచెల్లెలు శ్యామల కళాప్రపంచంలో వీణా అనే పేరుతో వ్యవహరింప బడుతుంది.' అని రామకృష్ణ అంటూంటే శ్యామలచెయ్యి కదలి వ్రేలినున్న ఉంగరం మీద సూర్య కిరణాలుపడి వీణా అనే రెండక్షరాలు ప్రకాశించాయ్. 'అతిథులందరు నా యీసత్కారము నందుకుని నన్నానందింప జేయ ప్రార్థించుచున్నాను.' అంటూ ఒక పెద్ద పళ్ళెంనిండా కాఫీ గ్లాసులు పెట్టుకుని వచ్చి తలొకటీ ఇచ్చింది నిర్మల.

అందరూ ఒకళ్ళవద్దొకళ్ళు సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. 'శ్యామలా!' ఆఉంగరం మెక్కడిది ఈనాడు పెట్టుకున్నావు క్రొత్తగా?' అని విశ్వేశ్వరం ప్రశ్నిస్తే. 'మాఅన్నయ్య రామకృష్ణ వెనక ఒకమారు స్కూల్లో చదువుకుంటున్నప్పుడు ఒక

కళాప్రదర్శనంలో నేను వీణ వాయించినందుకుగాను బహూకరించారు. అది ఇవ్వాళ పెట్టె సర్దుకుంటుంటే కనిపిస్తే పెట్టుకున్నాను. అప్పుడే మా హెడ్‌మాస్టర్‌గారిచ్చిన 'గోల్డు మెడల్ కూడా చూపిస్తానుండండి' అని గభాలున పెట్టెలోనుండి తీసి చూపిస్తే ఆశ్చర్యపడి 'ఈవిషయాలన్నీ నాకెప్పుడూ చెప్పలేదేం శ్యామా! ఔన్లే. ఎవరిగొప్ప వాళ్ళే ఎలా చెప్పుకుంటారు! సరేకానీ పాటకచ్చేరీ చేస్తానంటావా?'

'నాదేముంది? మీయిష్టం.'

'చూడు శ్యామా! నిజంగా యిన్నిరోజులబట్టీ నేను పడుతున్న బాధ ఇవ్వాళ్ళ మాయమైంది. ఇంతవరకు మీకెవ్వరికి చెప్పలేదు. ఈసంతోష సమయంలో చెపుతున్నాను. దమ్మిడీ చేతిలో లేక పైగా సంపాదించుకోవటానికి శరీర పరిస్థితులు బాగా లేక బావగారింట్లో వచ్చిపడ్డాను. ఎంత బాధ పడ్డానో తెలుసా శ్యామా! ఇవ్వాళ నాకా బాధనుండి విముక్తి కలిగింది నీమూలాన. నీకళామూర్తికికూడా కారుమేఘాలనుండి విముక్తి కలిగింది శ్యామా! ఓహో పొరపాటు వీణా!'

'అందరికీ వీణా ఐతే మీకూనా యేమిటి? మీకెప్పటిలాగా శ్యామనే.' అంటూ ఆ ప్రేమమూర్తి పళ్ళో దూరింది కళామూర్తి శ్యామల.

లలితారామకృష్ణలకు నిర్మలాకమలనాథప్రసాద్‌లకు పెళ్ళైపోయింది పదిరోజులక్రిందట. తను బి. ఎ. పూర్తిచేసిన తర్వాత

పార్వతిని చేసుకుంటానన్నాడు సత్యనారాయణ. రేలానినోజున తనవాళ్ళందరితోపాటు బెజవాడ వస్తున్నానని రాజాగారికి ముందుగా తెలియబరిచాడు కేశవరావు. ఆరోజుకే ఆనందపురా న్నుండి రావాలని వెంకట్రావుకు తెలియబరిచారు రాజాగారు.

సాయంత్రం 5 గంటలకు మిత్రబృందమంతా బయలుదేరింది రిహార్సల్ హాలుకి. అందరినీ సగౌరవంగా ఆహ్వానించారు రాజా గారు. 'రాజాగారూ! ఇదుగో ఈమెనుగురించే నేను మీకు వ్రాసింది. చాలా చక్కగా వాయిస్తుంది వీణ. 'వీణా'అన్న తన పేరును సార్థకం చేసుకుంది. స్కూల్ఫైనల్ ప్యాసయింది. గౌరవనీయమైన సంసారస్త్రీ. మనసంస్థలో ఉండదగిన వ్యక్తి. అదుగో ఆవిశ్వేశ్వరంగారే యీామెభర్త. చాలామంచివారు. తర్వాత ఇదిగో మాచెల్లెలు లలిత. ఇంటర్ పూర్తిచేసింది. అతనే మాబావమరది రామకృష్ణరావు. ఫొటోగ్రఫీకోర్సు పూర్తిచేశాడు.' అని కేశవరావు, చెప్పింతర్వాత 'ఈమె నాచెల్లెలండీ నిర్మల. ఇంటర్ పూర్తిచేసింది. అతనే మాబావ మరది కమలానాథప్రసాద్. నాతోపాటే బొంబాయిలో స్టాండ్ ఇంజనీరింగ్ కోర్సు పూర్తిచేశాడు.' అని రామకృష్ణ చెప్పిన తర్వాత 'మాచెల్లెలు పార్వతండీ. స్కూల్ఫైనల్ ప్యాస యిం దీ యే' డంటూండగా మాధవరావుగారూ సత్య నారాయణా హాల్లో అడుగుపెట్టేరు. 'అదుగో ఆసత్యనారాయణ గారే కాబోయే పార్వతి భర్త' అని ప్రసాద్ పూర్తిచేశాడు.

'ఎక్కడనుంచీ రావటం గురుశిష్యులు?'

'మేష్టరుగార్ని మావూరు తీసికెళ్ళానండీ రాజాగారూ!' మిఠాయిత్తరం చూసుకుని బయల్దేరి వచ్చేశాం. ఇప్పుడే వచ్చింది బండి.'

'ఇవ్వాళ్ళంటే ఇవాళ్ళే రావాలా? రెండు రోజులు ముందుగా వచ్చి నాతో కులాసాగా కాలక్షేపం చేస్తే పాపం చుట్టుకుంటుం దటయ్యా' అంటూ చిరునవ్వుతో రాజాగారు వాళ్ళకీ వీళ్ళకీ పరిచయం చేశారు. సత్యనారాయణకా సంస్థలోని సభ్యత్వానికీ, అతనిపై రాజాగారికి గల ప్రేమాభిమానాలకు ఆశ్చర్యపడు తున్నారు పార్వతీప్రసాద్ లు.

'సత్యనారాయణగారా! ఏవూరండీమీది?' అదేమిటో గమ్మత్తుగా అడిగింది వీణా.

'అలా అడిగారేం! ప్రస్తుతమీవూరే'.

'ఆనందపురంలో మీకెవరైనా వున్నారా?'

'ఆ ఎవరో కాదు. మాఅమ్మానాన్నా వాళ్ళే ఉన్నారు. అలా అడిగేరేం? మీకెవరైనా చుట్టాలున్నారా అక్కడ?'

'సత్యం!'

మిగతావాళ్ళంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు.

'మావాళ్ళంతా అలాగే పిలుస్తారులెండి.'

'ఇంకా గుర్తుపట్టలేదా సత్యం? అప్పుడే మరచిపోయావా?'

లేదండీ. మావాళ్ళుకూడా ఎప్పుడూ చెప్పలేదే మా
ంలో వీణా అనే పేరుగలవాళ్ళున్నారని!'

'క్షమించు సత్యం! నాపేరు వీణా కాదు. కళా ప్రపంచంలో
ాత్రమే ఈపేరుతో వ్యవహరింపబడుతున్నాను. కాని అసలు
రు- నీకు తెలుసుగాని మరచిపోయావు. నీతోపాటు తొమ్మిది
ళ్ళదాకా మీవూళ్ళోనే గడిపేనే-శ్యా-మ-ల—'

'ఎవరు! శ్యామలా!'

'అవునుసత్యం! గుర్తుకొచ్చానా?'

'శ్యామల! ఇదేమిటి శ్యామలా! ఇంత మారిపోయావు?
-డి కొచ్చావేం? ఓహో! వీణ వాయించటానికే గదూ?
ుటి ఎన్నాళ్ళైందిచూసి' అనంటూండగా కుర్రాడు
ళ్ గ్లాసులు తీసుకువచ్చి తలొకటీ ఇచ్చాడు. వాళ్ళిద్దరి
షణా మిగతావాళ్ళ కయోమయంగా ఉంది.

కళ్ళవిషయాలొకళ్ళికి చెప్పుకునేటప్పటికి రాత్రి 8 గంట
తర్వాత అందరూ కలిసి సంప్రదించుకోగా తేలిన
ంశాలేమిటంటే, ఈకథనే మాధవరావుగారు సినిమాకు
క్లుగా మాటలూ పాటలూ వ్రాయటం, రాజాగారికి
న ఫిలింకంపెనీలో రామకృష్ణాకమలనాథప్రసాద్‌లు
ంట్ టెక్నీషియన్స్‌గా పనిచెయ్యటం, లలితానిర్మలలు
. పూర్తిచెయ్యటం, సత్యనారాయణ బి. ఎ., పార్వతి
ే పూర్తిచేసినతర్వాత పెళ్ళి చేసుకోవటం. వీణా, కేశవ
నారాయణరావులు మాధవరావుగారు వ్రాసిన పాటల

కల్లా ట్యూన్ చెయ్యటం, విశ్వేశ్వరం కళాస్యందనం త
నిర్వాహకుడుగా పని చెయ్యటం, ఈకళామూర్తు
సహకారంతో రాజాగా రీకర్డే 'వీణా' అనే పేరుతో స్లి
తీయ్యటం.

Jhend

J.1



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B134 |
| పుస్తకం పేరు | వీణా |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | n/o |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | rohith |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |